# ప్రతిభ

సంపుటి ౨ • సంచిక ౪



సంపాదకుడు: తెలికిచర్ల వెంకటరత్నం

నవ్య సాహిత్య పరిషత్తు : గుంటూరు

# △ నవ్యసాహిత్యపరిషత్తు △

**గౌరవాధ్యక్షులు:**

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి

శ్రీ రాయప్రోలు సుబ్బారావు

## స్థాయిసంఘము

**అధ్యక్షులు**

విశ్వనాథ సత్యనారాయణ

**ఉపాధ్యక్షులు**

గిడుగు వెంకటసీతాపతి

**కార్యదర్శి**

తెలికిచెర్ల వెంకటరత్నం

**సభ్యులు**

దేవరాజు వెంకటకృష్ణారావు
గురుభాగవతుల ధర్మారావు
ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి
పిలకా గణపతిశాస్త్రి
అత్తిలి సూర్యనారాయణమూర్తి
చిరుమామిళ్ళ శివరామకృష్ణప్రసాద్
వింజమూరి శివరామారావు
కొమర్రాజు అచ్చమాంబ
కాటూరి వెంకటేశ్వరరావు
పిసుపాటి వెంకటరమణయ్య
దేశిరాజు కృష్ణశర్మ
కోలవెన్ను రామకోటీశ్వరరావు
కొడవటిగంటి కుటుంబరావు
తుమ్మల సీతారామమూర్తిచౌదరి
పి. వి. రాజమన్నారు
శ్రీరంగం శ్రీనివాసరావు
చిలుకూరి నారాయణరావు

△

## కార్యనిర్వాహకసంఘము

**అధ్యక్షులు**

విశ్వనాథ సత్యనారాయణ

**కార్యదర్శి**

తెలికిచెర్ల వెంకటరత్నం

**సభ్యులు**

కోలవెన్ను రామకోటీశ్వరరావు
నోరి నరసింహశాస్త్రి
కొమర్రాజు అచ్చమాంబ

△

## ప్రతిభ సంపాదకవర్గము

తెలికిచెర్ల వెంకటరత్నం
శ్రీరంగం శ్రీనివాసరావు
ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి
పున్నవ లక్ష్మీనారాయణ
అడివి బాపిరాజు
చింతా దీక్షితులు

△

## గ్రంథనిర్ణాయక సంఘము

శివశంకరశాస్త్రి
మల్లవరపు విశ్వేశ్వరరావు
జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి
కాటూరి వెంకటేశ్వరరావు

△

# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక



సంపుటి ౫ :: సంచిక ౪

△

ఏప్రిలు నెల ౧౯౪౧

△

సంపాదకవర్గము:

తెలికిచర్ల వెంకటరత్నం
శ్రీరంగం శ్రీనివాసరావు
ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి
పున్నవ లక్ష్మీనారాయణ
అడవి బాపిరాజు
చింతా దీక్షితులు


International Telugu Institute
Acc No
Hyderabad

# తోఁట

[మాధవ పెద్దికవి]

నుదుటను ఘర్మబిందువులు నూతనమైన సువర్ణపట్టికం
బొదిగిన యాణిముత్తెముల బోల్కిని ముద్దులు మూటగట్టఁ బ
య్యెద సవరించుచున్ బొడుపు టెండను తెప్పల నార్చుకొంచుఁ బూఁ
బొదలకు నీవు నీరములు వోయుట లందము లొల్కఁ బోయుటల్,

ఎడపక దోహద క్రియల నీ వొనరించెడి పట్ల మేనిపైఁ
బొడమెడునట్టి క్రొంజెమట మొగ్గలఁ జూచియుఁ జూచి తానునుం
బొడిగెను జాజిమొగ్గలను దొయ్యలి! యివ్వనలక్ష్మి చూడు మె
ప్పడువున వైచుచున్నవియొ వాయువులున్ బిలపిల్ల మొగ్గలన్.

ఏలకి ముద్దుగొల్ప నొకచే మెయిముట్టను ముద్దుఁ జూపఁగా
మాలతి ముట్టరా దవలి మాటికిఁ బొంగులాబి ముద్దులన్
జాలఁగ జాలఁగా గుఱియఁ జూసరొ ముద్దులు మూటగట్టు నీ
పూలవనమ్ము కే వలపు పో! యిటు లీవు మొగమ్ము వెట్టినన్.

పోకలు పూచుచున్నపుడె పోకలఁ దమ్ములపాకు తీగియల్
ప్రాకుచుఁ బ్రాకుచున్నపుడె పైపయి వచ్చి లవంగవాయువుల్
సోకుచు సోకుచున్నపుడె సుందరి! యీ లవలీనికుంజ మం
దేకర ముండి నేఁడు సుఖియింతము రేపటి మాట కేమిలే.

ఇందీ రమ్యలతానికుంజమున నేనే నీవునై యుండి నీ
సౌందర్యమ్మును విప్పెదన్ నెమిలి పింఛం బట్లు లోచూపులో
నందింతున్ హృదయమ్ముకున్ హృదయమత్యంతమ్ము నర్తింతునా
నందాశ్రుల్ హావణిల్లి కన్గొనల నీ నా తృష్ణ చల్లారగన్.

(ఉమ్మర్ ఖయ్యామునుండి)

# సంవర్త ఝంఝ

"సంపత్"

నా హృదయంలో
నయాగరా జలపాతం
గర్జత్ ఝర్ఝర ఘోషలతో ఘూర్ణిల్లిన,
నా గళముఖరిత గీతికలో
మౌనవిపంచీ గద్గది కాలాపన కంపించును;
నా కనుపాపల చీకటిలో
ఈ విశ్వాంతర నక్షత్ర సమూహం కన్పించిన,
నాలో ఒక చిరుదీపిక వికసించును;
కానీ, నేనే డమరుకమై
నాలో అ. ఇ. ఉ. ణ్ణులు పలికిస్తూ,
నా అణవణు వేదో
నూతన చైతన్యం కావాలని
నాలో ఉన్మత్త వికాసం రావాలని
నా గీతికలో నవ్యత్వం తేవాలని
శైశిరతమస్సులో ప్రసరించిన
ప్రాతర్హాసం వలె పరిమళించి
నా హృదయ రసాతల తల్పంలో
నిదురించిన శక్తులు పైకి చేది,
తత్ బలవత్ చోషిత శక్తులతో
నాలో రేకెత్తిన భావా లేవేవో చికిలిపెట్టి,
కత్తులవలె ఝళిపిస్తూ,
మృడాని భ్రూవళనంవలె జడిపిస్తూ,
జీర్ణప్రపంచదశిశాస్థులు పొడిచేసుకపోతూ,
ప్రచండ ఝంఝూపవనంవలె విరుచుక పడుతూ,

నన్నెదురించే వింధ్యాచల శృంగాలకు
నా అగస్త్య చరణం చూపిస్తూ,
నాపై అతి కసిగా
రుసరుస లాడుతు, పడగలు విసరివిసరి
బుసకొట్టే తక్షక కాకోదరకోటికి
నా ఓంకార ధనుర్గుణ టంకారంతో
గరుడాస్త్రం సంధిస్తూ,
నా కోసం
నిత్యతపశ్చరణాలసనిరీక్షణల
ప్రోషిత భర్తృకలై శోషిల్లిన
సుప్తశిలా బాలికలను మేలుకొల్పి
నాలో ఒదిగిన శాంబరితో, నన్నదిమిన
స్వప్నప్రపంచ శబలిత సంధ్యాలోకనలో
జాగ్రదవస్థకు లొంగని భావాలను పూజిస్తూ,
అంతర్నియమా లేవేవో అనుసంధించిన
ఆలాపన చేస్తూ, ముందుకు పోతూంటే
చక్రనిరంతర మంత్రఘోషలో
హవిస్సులై పోయిన ఆత్మలు —
సమాధిలో పగిలిన గొంతుక —
చితాగ్నిలో కాలిన ప్రేతం —
కదనంలో కూలిన మొండెం—
పరివేదనతో చేసిన
ఆక్రందన వినబడ్డది —
"పృథివీరథ చక్రాల్
రక్తపు కందెనతో
చక్రమణం చేస్తున్నవి;
నిరుపేదల గుండెలలో

నెలవేసిన వ్రణపూయం
నదులై ప్రవహిస్తున్నది;
భూతపిశాచీ రాక్షసమణితం
గుళ్ళల్లో ఘూర్ణిస్తున్నది;
విలయానికి
కలికాలం
బలిపీఠం సవరిస్తున్నది."
అని అంతంతకు నీరవమై,
చెలరేగిన శంఖధ్వనిలో
సుడిగాలుల మసకాటల జడలో
పడిపోయిన దార్త నినాదం.
వెనువెంటనె
కనలిన కపాలి నేత్రం
కదలిన క్షపాలవిత్రం
కనిపించిన వప్పుడు :

అప్పుడు నాకళ్ళల్లో రక్తాశ్రులు;
అమావాస్య పులుముకొన్న చీకటికాటుక;—

— నా ఊపిరి బంధించి,
నా చైతన్యం ఉడిగించి,
నను పరివేష్టించిన అగ్నిలతల
హల్లీసక కల్లోలం
పైకొని నను హవిస్సుగా కబళించిన,
నిలువున కాలిన నా శరీర భస్మం
నేనే విభూతిగా వినియోగిస్తూ
రక్తాకుల వివిక్త భూములలో
చచ్చిన శవాలు వెదకుతు

నరమాంసం కావా లని
జటాయువుల
పటాలములు
హుటాహుటిగ వస్తూంటే,
రక్త స్విన్నములై
పదనెక్కిన నఖర వ్రజ
మెదలో దూరిన చూస్తూంటే,
కలిగిన
ఇదివలి కే వెలుగని, ఈ
అనుభూతికి
సర్వాంగీణముగా జలదరించి
బృహతీ మహతీ శ్రుతులకు కలియని
ఆవేదన లటమటించు
నా గొంతుకలో
క్షుభిత ప్రపంచరుదితం
నగ్నోద్విగ్నంగా నినదించును
ప్రస్థానత్రయ మిమిడిన
యీ నా గీతా భాష్యంలో
సౌజన్యం, సౌహార్దం, సౌహిత్యం
లోకానికి ఛేకానుప్రాసంగా
కావాలని ఆశిస్తూ,
దారిద్ర్యం, దౌర్జన్యం, దౌరాత్మ్యం
దేశానికి ద్రోహప్రాయంగా
చూడాలని శాసిస్తూ,
మృత్యువు నీడలలో కునికే
నిర్భాగ్యమైక జీవుల కోసం
సమరం సాగిస్తూ,

హతభాగ్యుల లలాట
దురదృష్టాక్షర పరీక్షలన చేస్తూ,
ఈ క్షుభితాత్మల
నేత్రోజ్జ్వల నక్షత్ర సహస్రందాల్చి,
గాత్రోద్ధృత దివ్యపటుత్వం పీల్చి,
శాంతిలేని
కాంతిలేని
గుండెలలో వండిన రక్తాన్నం కోసం
మూగిన
తక్షకులకు నర
భక్షకులకు ఉరి
శిక్షలు వేస్తాం;

కుక్షికి కఱవై
క్షుధాశుశుక్షణిలో కనలే
భిక్షుకులకు
రక్షణ కల్పిస్తాం.

ఇక మన
నరజాతికి సౌఖ్యం రెట్టిస్తాం :

ఇదె మన
నరకంలో స్వర్గం కట్టిస్తాం : :

# చీకట్లో మెరుపులు

"పాప"

అది చాలా తమాషా రాత్రి—అంటే నా ఉద్దేశ్యం సాయంత్రమని. ఇంకా సరిగ్గా చీకటి పడలేదు. అప్పుడు ఆ రిక్షా అతని కోసం ఇంటిముందుఆగిఉంది — రోజూలాగే. ఆ రిక్షా ఆగడం ప్రపంచక్రమంలో ఒక భాగం-సూర్యుడు పొద్దున్నే ఉదయించడం, సాయంత్రం అస్తమించడం లాగ. ఏ నిమిషాన్నో హఠాత్తుగా పేలిపోయి—గాసు బాంబులా — ఊపిరాడనంతటి చీకటితో భూమిని ముంచేస్తుందా అనిపిస్తోంది రాత్రి. చలిగాలి చెమ్మగిల్లిన సందుల్లో ఇంటి చూరులలోంచి మూలుగుతూ ఉంది. అప్పుడా రిక్షా—రోజూలాగే — అతన్ని మోసుకుపోతోంది. ఒంటరిగా, తీక్ష్ణంగా "టిలుక్ టిలుక్" ఆ చీకటిని తప్పుకోమంటూ, దారిచేసుకుంటూ పోతూ ఉంది.

ఆ రిక్షాని అంతా ఎరుగుదురు — అది ఆదారిని ఆ వేళకి వస్తూ ఉంటుందని అంతా ఎరుగుదురు. అయినా వాళ్ళు ఒకరి చెవిలో ఒకరు గుసగుస లాడుకోరు. ఎందుకంటే, ఆ 'సంగతి' పాతబడిపోయింది. దానికి అసలు మొదలూ లేదు, తుదా లేదు. ఆ యింటి ముందు ఆ రిక్షా ఆగడం వాళ్ళలో చాలా మంది కుఱ్ఱతనంనుంచీ చూస్తున్నారు. ఇప్పుడు వాళ్ళ కుఱ్ఱవాళ్ళుకూడా చూస్తున్నారు. కొద్దిమంది మాత్రం అతన్ని చిన్నతనంలోనే ఎరుగున్నవాళ్లున్నారు. వాళ్లు అతన్నిగురించి మాట్లాడేటప్పుడు ఫలానా వారి అబ్బాయి అని అంటూ ఉంటారు. కొంచెం వయస్సు ముదిరిన వారికి ప్రతివాడూ అతని తండ్రిగారి అబ్బాయి. అతను అతనయినా కాకపోయినా సరే, ఫలానా వారి అబ్బాయి మాత్రం అయి ఉంటాడు. అంచేత వాళ్ళేమనేవారంటే 'ఆ ఫలానా వారి అబ్బాయి అతనివయసులో, తిరుగుబోతు, రౌడీ, కవి...' అని 'ఆ ఇంట్లో' 'ఆమె'తో అతనికి జోస్తి ఎల్లా కుదిరిందో ఆ విషయం కూడా వాళ్లు ఎరుగుదురు.

ఆ పెద్దవాళ్లు చెప్పినట్టు, తిరుగుబోతుగా, రౌడీగా, కవిగా...అతను తన వయసులో ఉన్న సంగతి అంత నమ్మతగింది కాదని గట్టిగా ఎవరూ అనలేదు కాని, ఇదివరకెప్పుడు గాని అతను అల్లా ఉండి ఉంటాడని ఎవరూ అనుకోరు. ఎందుకంటే అతను గోకలిబండ, మేకపిల్ల లాగ సాధువు. నిరపాయకర మయిన ప్రాణి. ఎంత అందమయిన ఆడవాళ్ళ నయినా తన కాళీ చూపులు ఎత్తి—ఎంత కాళీ అంటే వేదాంతంగా కనబడేటంత—చూడబోయి

నట్టు ఎవరూ చూడలేదు. ప్రపంచకాన్ని ఎక్కువగా చూచిన మూలాన్ని, ప్రత్యేకంగా ఏ ఒక వస్తువు మీదా అతనికి— కుతూహలం లేనట్టుగా అనిపిస్తాడు. అతను తన రోజుల్లో ఎంతోమంది అందమయిన ఆడవాళ్ళను చూసి అయినా ఉంటాడు, లేకపోతే, అందమనే మాయ అతని జ్ఞప్తిలోంచి జారిపోయి అయినా ఉంటుంది. అతను నాస్తికత్వం అవతారం దాల్చినట్టు కనిపిస్తాడు. అతని మూపు రేఖలలో "లేదు" విస్పష్టంగా, అనుమానం లేకుండా వ్రాసి ఉంది.

ఆరుఅడుగుల అతనిశరీరం ఉన్నా లేనట్టుగా ఉంటుంది. అతని ప్రతి అంగంలో నుంచి చటుకున కనబడేది ఏదో లోపించింది. కోలముఖంలో లోతుకళ్ళు ఎదురుగా ఉన్న వస్తువుల్ని చూడ్డం మరిచిపోయాయి. రోడ్డు పక్క కొన్నిసంవత్సరాలుగా నిలబడీకూడా తన వ్యక్తిత్వం నిలుపుకోలేని లాంతరు స్తంభంలా అతను కనిపిస్తాడు.అతని తెల్లటి గ్లాస్గోమల్లుపంచి, ట్వీడ్ కోటు, ఎడమచేతిని బంగారపుగొలుసూ, చేతిగడియారం, చెదరిపోకుండా దువ్వినమీసాలూ, అగరునూనె వ్రాసి దువ్వినక్రాపు, నీరసంగా అతన్నుంచి వ్యాపించే యీవెనింగ్ పారిస్ వాసన, అన్నీకూడా తమతమ గుణాలు మరిచిపోయాయి. ఇవ్నీ తనకు ఉన్నాయని అతనూ మరిచిపోయాడు. పొద్దున్నే పడమటి దిక్కున లేచి అలవాటుచొప్పున సాయంకాలానికి తూర్పుకి వ్యాపించే నీడలా అతని దినచర్య స్థిరపడిపోయింది.

అతను రిక్షా దిగి గుమ్మంఎక్కాడు. పక్కని వీథిలోఉన్న ఎలెక్ట్రిక్ దీపంఅనుమానిస్తూ ఆరి వెలుగుతూంది. మామూలులాగ ఇరుగు పొరుగు పిల్లలు అతని చుట్టూ మూగలేదు—బిస్కత్తులు, చాకొలెట్లులు బహుమతులు పుచ్చుకోడానికి. ఎందుకంటే శీతగాలి తిరిగింది. వేసవిలో అల్లా రోజూవచ్చేవాడు. అసలు మొదట ఒక కుఱ్ఱవాడే. క్రమంగా అంతా తయారయారు. ఒకరోజున అతను గుమ్మంలో నిలబడి ఉండగా ఒకకుఱ్ఱవాడు వచ్చి అతని పక్కనిలబడ్డాడు. అతన్ని ముఖం పైకెత్తి, అమాయకంగా, కొంచెం చిలిపితనంగా చూశాడు. వాళ్ళంతా అంతే, అల్లాగే ఉంటారు, అమాయకంగా కొంచెం కొంటెతనంగా. అంచేత వాళ్లు అల్లా చుట్టూమూగినప్పుడు అతను బిస్కత్తులు వగైరా ఇవ్వకతప్పిందికాదు. కాని వాళ్ళకీ అతనికీ ఎంత అంతరం ఉంది! అందులో ఎవరితోనూ అతను మాట్లాడలేదు. మాట్లాడ లేకపోయాడు. ఏం మాట్లాడాలో అతనికి తెలియదు. ఊరికే బిస్కత్తులు వగైరా ఇవ్వగలడు అంతే!

అతను మెట్లుఎక్కి తలుపు తెరిచాడు. చటుక్కున చలివేసినట్టు తలుపు కీచుమంది, దీర్ఘంగా ఏ-ఏ-ఏదు అన్నట్టుగా. అతనికి చిరాకు వేసింది. అంచేత మామూలుకంటే

మరీ సాధువులా అయిపోయాడు. లోపలి నుంచి దాసీ బయటికి వెళ్ళిపోతూ, ఆ చీకట్లో అతన్ని ఆనమాలు పట్టింది. అంది. — "లేదండి అయ్యగారు! ఎక్కడో పెళ్ళిఅవుతుందంట, మేలాని కెల్లిందండి."

కొంతసేపు తటపటాయించి చటుకున అవతలికి వెళ్ళిపోయింది. అతని గొంతుక మెల్లిగా మొరిగింది. దాసీ తనని చూసి జాలిపడుతోందని అతను అనుకున్నాడు. అతను అసహ్యించు కున్నాడు.

"ఎవరది?" అంది ఒక దీపం ఒక పక్క గదిలోనుంచి ఇవతలికి వస్తూ. అతను మళ్లీ మెల్లగా మొరిగాడు.

"ఓ! అయ్యగారా? చెల్లాయి ఊళ్లోకి పోయింది. మీా పలారం గదులో వుందండి" ఆమె 'ఆమెకు' అప్ప.

అతను తన గదిలోకి వెళ్ళాడు. మంచం పక్కని బల్లమీాద రోజూలాగ కాల్చిన కల్లురొట్టె, ఫ్లాస్కుతో కాఫీ ఉన్నాయి. అది అతని రాత్రి ఆహారం. అతని ప్రతికీలు బద్ధకించింది. పరుపుమీాద పడుకున్నాడు. తీక్ష్ణమయిన రంగులతో వెగటుగా పెద్ద లతలూ పువ్వులూ అద్దిన మంచం పందిరి కొంచెం ఊగింది. రెపరెపలాడింది. చల్లని ఆ పరుపుమూలంగా అతనికి గుండెలదాకా గడ్డకట్టిపోయింది. ఏదో బాధ తీర్చుకోడానికిలాగ అతను గోడమీాద తగిలించిఉన్న దీపంవేపు తిరిగాడు- ఉత్సాహం కోసమో, వేడికోసమో!

అతనికి- ఎక్కడో- నిజంగా బాధగా ఉంది. ఎవరో తన గుండెల్ని వెనక్కి తిరగదీసినట్టుగా. తనువిప్పి తిరగదీసి గిరవటేసినకోటు చిలకకొయ్యని వేలాడుతో ఉంటే అతనికి భయం వేసింది. అతను ఎప్పుడయినా సుఖంగా ఉన్నాడా—ఆ ప్రశ్న మూర్ఖంగా కొంచెం అసహజంగా ఉంది. తన్ను చూసి తను జాలిపడ్డమేమిటి? అసలు ఆ దీపం లేకపోతే ఆ ప్రశ్న రాదు. సుఖం కోసమే పందెం పరిచాడు, ఇన్నాళ్ళూనూ. అది దొరికిందో లేదో—తన్సాల్ చెక్కా— అతను చెప్పలేడు. అసలు సుఖం అంటే ఏమిటి? ఎవరికీ తెలియదు. సవ్యంగా పెళ్ళి చేసుకున్న వాళ్ళంతా సుఖంగా ఉన్నారా? అదీ నమ్మకం చెప్పలేం. చిన్నచిన్న విషయాల్లో—వాళ్ళబ్బాయి చొక్కా రంగు దగ్గరనుంచీ—భార్యా భర్తలు మాటా మాట అనుకోడం అతను చూశాడు. ఆ మాట కొస్తే ఉంచుకున్నా, పెళ్ళి చేసుకున్నా ఒకటే. అదంతా ఒక లాటరీ— మంచి ఆడది దొరుకుతుందో, చెడ్డది దొరుకుతుందో. కాని పెళ్ళి అంటే ఇంక స్థిరమయినది. ఉంచుకోవడం వేరు. క్రమంగా మనుష్యులకి ఒకళ్ళమీాద ఒకళ్ళకి విసుగు పుడుతుంది. కాని పెళ్ళి అంటే చచ్చినా బ్రతికినా కట్టుబడి ఉండవలసిందే. ఇంక తప్పించుకోడానికి వీలు లేదు. మంచి అయినా తప్పదు, చెడ్డ అయినా తప్పదు. అతనికి చిన్నతనం నుంచీ పెళ్ళి అంటే—

అసహ్యం కాదు—అమితమయిన భయం. ఆ దీపం కన్ను మిటకరించి 'లేదు' అన్నట్టు మినికింది. అతని ఆలోచన చెదిరిపోయింది. ఆ వేడిమి—లేక ఉత్సాహం కూడా పోయింది. ఆ దీపానికి దాని యందే నమ్మకం లేదు. ప్రపంచకంలో దేనికీ లేదు! దానివేపు అత నింక చూడలేక పోయాడు. మళ్ళీ పక్క చల్లబడిపోయింది. అతను పక్కకి ఒత్తిగిల్లాడు. బల్లమీద ఉన్న కాల్చిన కల్లురొట్టి, కాఫీ ఫ్లాస్కు కనబడ్డాయి. చటుకున అతనికి ఆకలివేస్తో ఉన్నట్టు జ్ఞాపకంవచ్చింది. రొట్టి ముట్టుకుంటే చల్లగా ఉంది. అనుకోకుండానే అతను ఎడమచెయ్యి చొక్కాలోపలికి పోనిచ్చి కడుపు నిమురుకున్నాడు కొంచెం వేడిపుట్టడానికి. అసలు అక్కడకాదు అతనికి ఆకలివేస్తో ఉంటా! ఎక్కడో ఇంకోకొంత పైని! కాని కడుపుకీ గొంతుకకీ మధ్య సరిగా ఆకలి ఎక్కడో అతను కనుక్కోలేక పోయాడు. అంచేత అంతమేరా ఎడమ చేత్తో నిమురుకోడం మొదలుపెట్టాడు. ఆకలిఅంటే ఏమిటి? మళ్ళీ అదే! ఆ దీపమే, లేకపోతే ఇల్లాంటి ప్రశ్నలు తోచవు! అతను లేచి ఆదీపం ఆర్పేశాడు. గదిమరింత చల్లగా అయిపోయింది. చిలకకొయ్యని తగిలించిన కోటు తీసుకుని బయటికి వచ్చాడు.

చలిగాలి అతని చెవులపక్కనించి రివ్వుమంటూ వీస్తూపోయింది. ఇంకా ఎనిమిదిన్నర కాలేదు. అప్పుడే పట్నం ఎంత నిశ్శబ్దంగా ఉంది! రిక్షావాడు అరుగుమీద ఒక మూల పోగుపడి నిద్రిస్తున్నాడు. ఒక వేళ నిద్రపోడం లేదేమో, ఎందుకంటే అతని కాలిచప్పుడు విని చటుకున లేచాడు. రిక్షారోడ్డుమీదికి లాగాడు. అతను రిక్షా ఎక్కాడు. ఎక్కడికి వెళ్లాలో ఎరుగున్నట్టు రిక్షాసాగింది నమ్మకంగా. ఒకవేళ పరస్పరం మాట్లాడుకోకుండా ఉద్దేశ్యం బోధ పడుతుందేమో! ఒకవేళ పరస్పరం అర్థమే కాదేమో. రిక్షాగంట రాత్రిని గజగజ లాడిస్తో ఉంది. ఒకొక్క 'టిలుక్' చాకులా గుండె లోపలికంటా దిగిపోయి అమిత మయిన బాధ కలిగిస్తో ఉన్నట్టు అనిపిస్తోంది. ఎందుకంటే రాత్రి చచ్చిపోయే మనిషిలా మూలుగుతోంది.

రిక్షా బజారువీధికి తిరిగింది. ఆవీధిని తక్కిన వీధుల్లోకంటె కొంచెం దీపాలు వెలుగ్గా ఉన్నాయి. ఆ వెలుగులో వీధి విచిత్రంగా ఉంది. ఒక మిఠాయిదుకాణం ముందు జనం మూగి ఏదో మాట్లాడుతున్నారు. ఎందుకో కాచుకున్నట్టుగా వెనక కాళ్ళ మీద కూర్చుని చెవులు నిక్కబెట్టుకుంది ఒక పెద్దకుక్క. సగం నిద్ర సగం మెలుకువగా ఒక పెద్ద ఆంబోతు వీధి కడ్డంగా కదులుతోందా లేదా అన్నంత మెల్లగా కదులుతోంది. అట్టే చూస్తే కదులుతోఉన్నదీ లేనిదీకూడా చెప్పలేము. దీపాలు చలిచేత గావును బద్ధకంగా ఉన్నాయి.

ఆఁ! ఆ పెళ్ళి! ఎక్కడ అది? అయినా అతను అక్కడికి వెళ్ళాలని అనుకోలేదు. ఆ పోలీసువాడు ఉంటాడు తప్పకుండా అక్కడ. అతన్ని ఉద్దేశించే తన పాటలన్నీ పాడుతూ ఉంటుంది 'ఆమె'. కొంచెం ఎమురు తిరుగుతో ఉంది ఈమధ్య. అయినా అత నంటే చాలా గౌరవమే! ఇతరులతో ఆమె కొంత 'పరిచయం' చేస్తూ ఉన్నట్టు అతనికి తెలుసును. ఆమె ఇంక తన్ని లక్ష్యంచెయ్యా డం లేదని అతని మనస్సులో ఒక ఆలోచన రాబోయింది గాని, ఒక గొంగళీ పురు గుని తీసి పారవేసినట్టుగా, ఆ ఆలోచనని దూరంగా విసిరి పారవేశాడు.

రిక్షా తాళం తప్పకుండా కుంటుతోంది. అయితే వాడు అన్నది నిజమే, ఆ మెకా నిక్ కుట్రవాడు! రిక్షా కొంచెం బాగు చెయ్యాలి. ప్రతీదాన్నీ బాగుచెయ్యవలి సిందే, ఈ రోడ్లు ఈ దుకాణాలు, ఈ బళ్ళు ఆ కిటికీలు .....చివరికి ఈ దేహంకూడా బాగుకోరుతుంది. ఈ రిక్షా కొని అయిదు సంవత్సరాలు అయింది. కాని ఇప్పుడు కొంచెం శీలలు పట్టు తప్పాయి. తన బతుకూఅంతే. ఆ 'పోలీసువాడు' రాక క్రితం సరిగ్గానే నడిచింది. అయినా అసలు మనుష్యులలో ఒకరిమీద ఒకరికి విసుగు పుట్టింతరవాత, విచ్ఛిన్నం చెయ్యడానికి ఎవడయినా చాలు. 'ఆమె' ప్రస్తుత పరి స్థితిలో ఎవడితోపడితే వాడితోటే స్నేహం కలపి ఉండును. తనుమాత్రం ఆమెకు చాలా చేశాడు. కాని ఆమె తన కేమన్నా చూసిందా? వీడిలాగ, ఈ రిక్షాలాగే వాడి లాగ? వీడు పాపం చాలా అడకువగా ఉంటాడు ఈ రిక్షావాడు. పాపం ఎనిమిది రూపాయలు వీడి జీతం. రాత్రి అనక పగలు అనక ఈ వీధుల్లో నీ ఇష్టం వచ్చి నట్టు లాక్కుపోతాడు. పెళ్ళాం పిల్లలూ లే నట్టున్నారు వీడికి. ఏభయికి అవతలి పక్కకి ఒదిగాడు అప్పుడే. ఎప్పుడూ సణుగు కోలేదు; సంతృప్తిపడ్డట్టూ కనబడడు. వీడి కేమన్నా పూర్వగాథ ఉందేమో, ఈ రిక్షావాడికి? కాని ఆ ప్రశ్న అతను ఎప్పుడూ వెయ్యలేక పోయాడు. సున్నితమయినచోట వేలుపెట్టి గుచ్చినట్టు అవుతుంది. తనకో పూర్వగాథ ఉందిగనక. మొత్తం మీద అంతా అల్లా అనుకుంటారు.

రిక్షా పెద్దగా కుంటింది. పాదరసపు దీపం వెలుగులో కళ్ళు కనబడని ఈగ ఒకటి అతని కంట్లో జుంయిమంది. అప్పుడు అతను 'ఏయి' అని చేత్తో తోలివేశాడు. రిక్షావాడు 'ఏయి' తననేమో అనుకుని రిక్షామీద బరువంతా ఆని ముందుకి లాగాడు. మంచుకరిగి గాలి అయిన రివట ఒకటి అతని ముఖంమీద వీచింది. అంచేత కొంచెం వణికాడు.

ఆ పాదరసపు దీపంవేపు చూశాడు. నాల్గు వీధుల మధ్య ఎత్తుగా నిలబడింది అది. ఎంతోమేర తన ఊదా ఆకుపచ్చ వెలు గుతో పూతపూసింది. ప్రతి మొగం రంగు

వేసుకున్నట్టు ఉంది. ఆ ప్రదేశమంతా ఒక రంగస్థలం. దానిమీద మనిషి దౌర్భాగ్యపు బతుకు నాటక మాడబడుతోంది. ఏదో విషాదం, దుఃఖం ఆ వెలుగులో అలుముకుని ఉన్నాయి. చిరునవ్వుకూడా బరువుగా, విచారంగా కనబడుతుంది ఆ ఊదా ఆకుపచ్చమూలంగా. వెలుగుచల్లగా చచ్చిపోయినంత చల్లగా ఉంది. శవాల చెక్కిలమీదికి అల్లాటిరంగే క్రమంగా పాకడం అతను చూశాడు. లోకం మృత లోక మయిపోయింది ఆ వెలుగులో. అందులో ఊదా ఆకుపచ్చ దెయ్యాలు మసులుతో ఉంటాయి.

రిక్షా దీపస్తంభం దాటిపోతూ ఉండగా వీధికి అవతల ప్రక్కనుంచి ఒక గొంతుక కేక వేసింది.

"ఏయ్యో! ఏమోయ్ ! రిక్షా ఆపవోయి..."

'ఆ రోజులు' గడిచిపోయిన తరవాత అతన్ని పేరు పెట్టి ఎవరూ అల్లా పిలవలేదు! 'ఎవడ్రా వాడు' అనుకున్నాడు అతను. ఇంకొకరి నోట్లో తనపేరు వింతగా కొత్తగా కనబడింది అతనికి, ఎందుకంటే చాలా రోజులుగా అతనిపేరు ఉపయోగంలో లేదు.

"ఏమిటోయి ! ఎక్కడున్నావు ఇన్నాళ్లూ? కాలేజీ వదిలిన తరువాత మనం మళ్ళీ కలుసుకోలేదు. నిన్నసలు ఆనవాలు పట్టలేకపోదును ఆ పాడువెలుగులో. కాని నువ్వే అయి ఉంటావని అనిపించింది. ఎంత తమాషాగా కలుసుకున్నాం !

స్నేహితుడు రిక్షామీదికి ఎగిరాడు, అనుజ్ఞ అడగకుండానే. ఫలానివీధి, ఫలాని ఇల్లు అని ఆజ్ఞలా చెప్పాడు రిక్షావాడితో.

అతను ఏదో సాకుచెప్పా లనుకున్నాడు.

"నా మాటవిను. కొంచెం...పని...... రేపు తప్పకుండా......"

కాని స్నేహితుడు శుద్ధపెంకి, ఏ సాకులూ అతను వినడు. అన్నాడు.

"పని పాలలా తోడుకుపోదులే. ఇంతకాలం గడిచి కలుసుకుంటే ఏదో చవట పనుందని చెప్తావేమిటి ? అందులో రాత్రి పావు తక్కువ తొమ్మిదికి ! ఈ పాటి కసలు వెచ్చగాపక్కలోదూరి ఇంకోగుండెకాయకి గట్టిగా అదుముకుని ... అన్నట్టు నువ్వు పెళ్ళి చేసుకున్నావుటోయి? నాకు అల్లాంటి ఆచోకీ ఏమీ రాలేదు ఇంతవరకూనూ !"

"లేదు" అన్నాడు అతను. 'ఆ సంగతి' మాత్రం చెప్పలేకపోయాడు 'ఇంతకాలం గడిచి' కలుసు కున్న స్నేహితుడి దగ్గర ముందుగా 'ఆసంగతి' తేవడం అసంగత మనిపించింది. ఆ విషయమయి అతను సిగ్గుపడకపోయినా—కొంచెం ఏదో చిన్నతనం. స్నేహితుడు పెరగటమే ప్రయోజనంగా పుట్టిన వ్యక్తి. ఒడ్డూ పొడుగూ సరిపడి ఉన్నాయి. బలమంతా అక్కడే గడ్డ కట్టినట్టు దవడలు—చతురస్రంవంటి మొగం. మెరకగా విశాలంగా అనుమానం లేకుండా తిరిగే కళ్ళు—మెడకు ఇటూఅటూ బలవం

తంగా వంచిన ఉండేలబద్దల్లా వంపు తిరిగి కండలు శాకీచొక్కాలోకి మాయమయిపోయాయి. కదిలితే పదిచోట్ల టకటకవిరిగి సర్దుకుంటాయి నరాలు. ఆ పోలీసు దుస్తుల కోసం అవతరించాడు స్నేహితుడు. స్నేహితుని మాటల అతిలో అతని మితిలోని అసమర్థత, వెలితి కప్పుపడిపోయాయి.

స్నేహితుడు చెప్పడం మొదలుపెట్టాడు.

అతని పెళ్ళితో అతని జీవితం సరియైన మార్గానికి తిరిగిపోయింది. అతని భార్య —ఓ—ఎటువంటిదని. అంత అందమయినది లేదుకాని, అసలు అందమంటే ఏమిటి? ఆమె చలాకీగా తన స్నేహితులందరితోనూ నిస్సంకోచంగా మాట్లాడుతుంది. చదువుకున్న దయినా వెర్రివేషాలు లేవు. చదువంటే అంత ఎక్కువ చదువు కాదనుకో ఏదో స్కూలుఫైనలు దాటించింది. అతనితో గనగ చెపుతున్నాడు. పగలంతా అతనికి ఎప్పుడు రాత్రిపడుతుందా అని ఉంటుంది. చదువుకున్న దయినా పని బద్ధకిస్తుందా? అబ్బే! అసలు తను వంట బ్రాహ్మణ్ణి పెడదామంటే ససేమిరా ఒప్పుకోలేదు. మరే ఈ మధ్యనే ఈ ఊరు బదిలీ చేశారు. ఇల్లు వెతుక్కోడంలో చాలా రోజులు గడిచిపోయాయి. ఒక మోస్తరు ఇల్లు అతనికి నచ్చదు. అవును. పోలీసు డిపార్టు మెంటులోనే. అబ్బే లేదు. సబ్ ఇన్స్పెక్టరే. సర్కిల్ కాదు. అదయినా అతనినాన్న సర్కిల్ గా పింఛను తీసుకున్నారు గనక. ఈ రోజుల్లో బ్రాహ్మణులికి అవకాశా లెక్కడా? ఇదో పాడు డిపార్టుమెంటు. ఈపోలీసు డిపార్టుమెంటుఏమీ సరదా ఉండదు. కవిత్వంలోలాగ చమత్కార మయిన కల్పనలయినా ఉండవు. కేవలం శుద్ధఅబద్ధాలు పొద్దుటినుంచి సాయంత్రందాకా! అయితే కవిత్వం ఏమన్నా వ్రాస్తున్నాడా? లేదూ? అయ్యో! అతను వ్రాసిన ఆ రెండు పంక్తులూ ఎన్నడూ మరపురావు. ఎంత సున్నితంగా, అయినా ఎంత నిజంగా చెప్పాడు!

స్నేహితుడు అతన్ని భుజంమీద చనవుగా తట్టి చదివాడు.

“ఎదబిగువు జవ్వనమున చలించు నపుడు
రేయి నింద్రజాలములల్లు మాయగలదు.”

అవును అతను వ్రాసినవే! కాని అతను ఎల్లా వ్రాయ గలిగాడో అతనికి అర్థం కాలేదు. ఎప్పుడో మరిచిపోయిన కథ మళ్ళీ జ్ఞాపకం వచ్చినట్టు అనిపించింది. కాని ఆ కథలో అంశాల పరస్పర సంబంధం అతనికి జ్ఞాపకంలోకి రాలేదు. పూర్వం అతనొక కవి! కాని ఆ స్నేహితుడికి ఇంత కాలం దాకా ఎల్లా జ్ఞాపకం ఉన్నాయి ఆ పంక్తులు! ఎప్పుడో తన చేతిమీద మొలిచి, క్రమంగా అంతరించి పోయిన ఆరవ వేలులాగా కవిత్వం అతనిలో నించి క్రమంగా జారిపోయింది. ఆ పంక్తుల అర్థమేమిటో అతని కిప్పుడు బోధపడ లేదు. అతను మనస్సులో సిగ్గుపడ్డాడు. ఎవరి స్నేహానికీ అర్హుడు కాడు

తను. నిజం తెలిస్తే ఈ స్నేహితుడు దతసిని గౌరవిస్తాడా? ఒకప్పుడు తనని ఒక మహావ్యక్తిలా పూజించిన ఈ స్నేహితుడు.

ఒక చీకటి సందులోకి రిక్షా తిరిగింది. అక్కడక్కడమూసిన కిటికీలసందుల్లోనుంచి వెలుతురు ఊటలా ఊరుతోంది ఆ బరువయిన గాలిలోకి. రెండు వరసల ఇళ్ళు కట్టి ఎదట చీకట్లోకి మాయ మయిపోయాయి. ఏమీ లేని శూన్యంలో నుంచి కొత్త ఇళ్ళు మొలుస్తున్నాయి మొదట అనుమానంగా తరవాత నిజంగా. ఇది ఒక స్వప్న ప్రపంచకంలోకి దారి అనుకున్నాడు అతను. అక్కడ ఆశ, వెలుగు, వెచ్చదనం ఉంటాయి. రాబోయే లోకంలో చలాకీ అయిన భార్యజడలో గులాబీవాసన కోసమని అతను కొంచెం జాగ్రత్తగా గాలిపీల్చి చూశాడు. కాని గాలి తడిగాఉంది, కుళ్లిపోతూఉన్న చెత్తా, చెదారం వాసనతో. కొత్తగా మెరుగుపెట్టిన M- P-అక్షరాలు స్నేహితుడి భుజంమీద మెరుస్తున్నాయి. అప్పుడప్పుడు మరి ఆ కండలు తీర్చిన ఆచ్ఛాదన లేని ముంజేతులు, బరువైన మొద్దులవంటి మోకాళ్లు, చూస్తే బతుకుకి బలం అవసరమని అతనికి అనిపించింది. ఎంతసుఖంఅది, అల్లా దిట్టంగా, నిర్లక్ష్యంగా ఉండడం! ఇంటికిరాగానే చిరునవ్వుతో ఎదురు వచ్చే భార్య కలిగిఉండడం! ఎందుకంటే ఇతనికి ఈ పోలీసుపని అంటే ఇష్టం ఉండదు. అసలు అటువంటి పనికి అతని మనస్సు ఎక్కదు. కాని ఎంతఆనందంగా ఉన్నాడు! ఏదోసుఖం, ఏదోతన్మయత తనకి తప్పకుండా దొరుకుతుందని నమ్మకం ఉంటే మనిషి ఎంతకష్టమయిన పని అయినా చేస్తాడు. స్నేహితుడు బహుశా ఆఫీసులో కూర్చుని రాబోయే రాత్రిని గురించో క్రితం రాత్రి జరిగిన తమాషాలను గురించో ఆమెకు తను బాకీ ఉన్న బాధ్యతలను గురించో, ఇంకా ఎన్నో చిన్న చిన్న సుఖాలు-జీవితానికి అర్థాన్ని ఇచ్చే సుఖాల్ని గురించి ఆలోచిస్తూ ఉంటాడు బహుశా. ఆ స్నేహితుడికి రాత్రి తనకొక అపూర్వమయిన అనుభవం రాబోతుం దని నమ్మకం ఉంది. అందుకే పగలు ఎంతకష్టమయినా ఈదగలుగుతాడు. తనకిమాత్రం ఆ నమ్మకమే పోయింది.

"ఆపు" అని కేక వేశాడు స్నేహితుడు పోలీసులికి డ్రిల్లు చెప్పేటప్పుడులాగ ఆజ్ఞాపిస్తో. రిక్షావాడికి మెదడు దిమ్మెక్కి చటుక్కున ఆగిపోయాడు.

ఇద్దరూ గుమ్మం దాటి సావడిలోకి వచ్చారు. "ఏమండోయి" అని కేకవేశాడు స్నేహితుడు లోపలికి భార్యని ఉద్దేశించి. ఇద్దరూ కూర్చున్నారు, స్నేహితుడు జోడు విప్పుకుంటున్నాడు.

సావడిలో మధ్యగా నీలపు ఎలెక్ట్రిక్ దీపం వెలుగుతోంది. నాలుగయిదు కుర్చీలు గోడలకు చేర్చిఉన్నాయి. అతనికి నాలుగు గజాల దూరంలో ఒక పెద్ద నల్లకుక్క

నిద్రపోతోంది. మొట్టమొదట అది కళ్ళు తెరవకుండానే మొరగా లనుకుంది కాని యజమాని కాళ్ళచప్పుడు, జోడు విప్పుకుంటో ఉన్న సవ్వడీ విని కొంచెం కళ్ళు తెరవక తప్పింది కాదు. మొదట చెవులు పైకెత్తి కొంచెం కళ్ళు తెరిచింది. ఎదురుగా కొత్తమనిషి కనబడితే దానికి మొరగాలో, అక్కరలేదో తెలియక కొద్దిగా మొరిగింది. ఒళ్ళువిరుచుకుంది, నాలుక చాచి ఆవలించింది, మళ్ళీ కొంచెం గట్టిగా మొరిగింది.

"అల్లా పో!చవటా! ఆయన మా స్నేహితుడని తెలియదూ? నీ చిత్రాలన్నీ ఆయన మీద ప్రయోగించకు" అని కొంచెంగా పక్కలో తన్నాడు స్నేహితుడు. అది సణుగుకుంటో ఇంకో మూలకిపోయి పడుకుంది. స్నేహితుడు అతన్ని ఉద్దేశించి అన్నాడు.

"ఇది తమాషాకుక్క. ఇది పెద్దమనుష్యుల మీదే మొరుగుతుంది. ఒకవేళ దాని సానుభూతి అంతా కేడీలమీద ఉందేమో; అచ్చంగా మాపోలీసు డిపార్టుమెంటులాగే. నీ కనుమానం అక్కరలేదు. కాని పోలీసు డిపార్టుమెంటులాగే అదికూడా ఎవరికీ అపాయం చెయ్యదు. దానిపేరు లోలా."

"లోలా?..."

"అవును. నీకూ జ్ఞాపకం ఉంటుంది ఆ పేరు. మనతో చదువుకుంది ఆంగ్లో ఇండియన్ పిల్ల. మనం ఇద్దరం ప్రేమించాం. నీ ఉలుకంతా ఏదో పద్యాలువ్రాసి పెద్దమనిషి తరహాగా తీర్చుకున్నావు. నేను మాత్రం ఉత్త చవటనయిపోయాను. అప్పుడు నువ్వు వ్రాసిన పద్యాలు ఇంకా ఎక్కడో ఉండాలి నాదగ్గర. అంచేత ఆ పేరు పెట్టేశాను. ఇప్పుడిది పెద్దది అయిపోయిం దనుకో. అయినా పాపం పరిశుభ్రంగానే ఉంటుంది దాని వయస్సుకి."

స్నేహితుడి బోలాబోలీకి అతను సిగ్గుపడ్డాడు. ఎప్పుడో మరిచిపోయిన లోలారూపం మళ్ళీ జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నించాడు. నిద్రపోతూ ఉన్న స్మృతులు మేలుకొలపబోయాడు ఆనాటి చిన్న చిన్న సందర్భాలు జ్ఞాపకం తెచ్చుకుని స్నేహితుడితో ఏదో మాట్లాడాలని అనుకున్నాడు. కాని ఆ స్మృతులు చాలా కాలం క్రితమే చచ్చిపోయాయి. ఎక్కడో దాక్కున్న నీడల కోసమని ఒక చీకటియింట్లో వెదుకుతున్నట్లు అనిపించింది అతనికి. అసలు అందులో నీడలు లేవు. ఎందుకంటే వెలుగే లేందే నీడలు ఎల్లా వస్తాయి.

"ఏమండీ! ఎందుకింత ఆలస్యమయింది? ఈ వేళ?" అంటూ సావడిలోకి పక్క గుమ్మంలోనుంచి వచ్చింది ఒక చలాకీ అయిన భార్య. ఆమె హాస్యంగా ఏదో తీక్ష్ణమైన అపచారానికి సమాధానం అడుగుతూన్నట్టు వచ్చింది. చేతులు రెండూ వెనక్కి కట్టుకుంది. మెడకొంచెం పక్కకి వంచింది తన నటనలో. సావడిలో ఇంకొక పెద్ద మనిషి ఉండడం చూసి ఎంతో సిగ్గుపడి

చటుకున లోపలికి మాయమయి పోయింది. "అయ్యో! నా తెలివి!" అంటూనూ. కాని స్నేహితుడు ఆమెను ఆపివేశాడు.

"ఏమోయి! పారిపోకు. ఇతనే మన... నీతో చెపుతూ ఉంటానేం,ఆ స్నేహితుడు."

"అల్లాగా? చాలా సంతోషమండి" అంది ఆమె ఎంతో ఆనందంగా ఆశ్చర్య పడ్డట్టు. ఆమె నెమ్మదిగా సావడిలోకి తిరిగివచ్చి భర్తపక్కని నిలబడి మళ్ళీ అంది.

"చాలా సంతోషమండి. మిమ్మల్ని గురించి ఎప్పుడూ చెపుతూ ఉంటారు. మిమ్మల్ని చూడకపోయినా ఎంతో బాగా ఎరుగు న్నట్టు అనుకుంటాను నేను. మీరు ఇక్కడ ఉన్నట్టు తెలిస్తే ఒకరోజుని ఇక్కడికి పిలవ వలసింది."

స్నేహితుడు అన్నాడు. "ఇతను ఇక్కడే అంటిపెట్టు కున్నాడని నే నేమన్నా కల గన్నానా? కాలేజీ వదలిపెట్టిన తరవాత అతన్ని గురించి ఏమీ విననేలేదు నేను. ఆ మట్టుని నేను ఆశ్చర్య పడ్డాను. ఆ కుంటి రిక్షా, ఆ నిద్రపోతూలాగే ముసలిదయ్యాపు రిక్షావాడు, అందులో రాత్రి పావుతక్కువ తొమ్మిదింటికి, వెచ్చగా పక్కలో దూరి ఇంకో గుండెకాయకి గట్టిగా అదుముకుని పడుకో వలసిన........."

"అబ్బ! ఆ పోలీసు భాష అంతా కట్టి పెట్టండి" అంది భార్య. "ఇంటికి వచ్చే ముందు కొంచెం మర్యాద నేర్చుకుని మరీ రండి."

అతని వేపు తిరిగి క్షమార్పణగా అంది. "అసలు ఈ డిపార్టుమెంటండీ, మనుష్యు లని ఇల్లా పాడుచేస్తుంది."

అతనికి ఒక్క సారిగా కలిగాయి, సుఖమూ సిగ్గూ. ఆమె ఎప్పుడూ ఇల్లాంటి మాటలు తనతో అనలేదు. అంచేత ఏమనాలో అత నికి తెలియక ఊరుకున్నాడు.

అతనిని భోజనానికి లెమ్మని భార్యా భర్తలు బలవంత పెట్టారు. అతడు భోజనం చేసినట్టు అబద్ధం ఆడేశాడు. అసలు అప్పు డింక భోజనం సహించదు. అందువల్ల వా రిద్దరూ భోజనం చేస్తూ ఉంటే కొంచెం సరదాగా కబుర్లు చెప్పడానికి మాత్రం వెళ్ళి కూర్చున్నాడు.

పాపం వాళ్ళకి ఇంకాపిల్లలులేరు. అదేపెద్ద వెలితిగాఉంది. ఆ విషయమయిన సంభాషణ అట్టేసేపు నడవలేదు. ఎందుకంటే ఎవరికీ ఆ విషయమయి అట్టే తెలియదు. స్నేహి తుడు తన అలవాటుచొప్పున పోలీసుభాష మాట్టాడేవాడు. భార్య వెంటనే ఇంటికి వచ్చే ముందు మర్యాద కొంచెం నేర్చుకు రమ్మని మందలించింది. ఇంకా అంది.

నేను ఈ పదిహేను సంవత్సరాలనుంచీ ఎంతో ప్రయత్నిస్తున్నానండీ, ఏమయినా కొంచెం మారుద్దామని. కాని వారికి ఆ అల వాటు మాత్రం మారదు"

అప్పుడు స్నేహితు డన్నాడు "వెంటనే మారితే ఇంక సరదా ఏముంది? నీకు నా

మీద ఇంక విసుగు పుడుతుంది. అందుకే నే నిల్లా ఉంటేనే సుఖం"

"మళ్ళీ పోలీసు భాషే" అంది ఆమె.

ఈసారి వాళ్ళతోపాటు అతనూ నవ్వాడు. పదిహేను సంవత్సరాలు ఒక ఇంట్లో! ఇంకా ఇల్లా వేళాకోళాలు ఆడుకుంటున్నారు ఒకరి మీద ఒకళ్ళు!

అతను స్నేహితుని భార్యవంక విచిత్ర పడుతూ చూశాడు.

ఆమె పొట్టిగా కొంచెం లావుగా ఉంది. గట్టిగా గాలికొట్టిన రబ్బరు బంతిలా తూలు తోంది,ఆమెలోఏదో,అది యౌవనం కాదు. అవునేమో అతనికి తెలియదు. ఆమె చిరు నవ్వు నవ్వుతుంది, గట్టిగానూ నవ్వుతుంది. కొంచెం తిప్పుకుంటుందేమో కూడాను. కాని ఆమె చుట్టూ ఒకగిరి గీసుకుంది. అందులో భర్తకితప్ప ప్రవేశంలేదు. 'భార్య అంటే ఈమేనేమో!' అనిపించింది. ఆమె ప్రేయసిమాత్రం కాదు.

ఆమె రూపంలో ఇది చదివా ననుకున్నాడతను. "నేను నీకు మాత్రంకాను, నేను నవ్వగలను, పులకించేటట్టు చెయ్యగలను, సుఖించగలను, కాని నాకు ప్రేమఅంటే తెలియదు. నా చనువు కేవలం ఒకరి కోసమే; నీకు చేతనయితే నన్ను చూసి ఆనందించు. నేను నీకు కాకపోడం నీ దుర దృష్టం" అర్థంలేని విచారం అతని మన స్సులో నిండిపోయింది. కాని అతను ఎంతో ఆనందిస్తున్నాడు.

స్నేహితుడు అంటున్నాడు;

"సబ్ జైలులో కాంగ్రెసువా డొకడున్నాడోయి. వాడీవేళ నిరాహారదీక్ష మొదలు. దీని అర్థం ఏమిటో నాకు బోధపడదు. అన్నం మానెయ్యడ మేమిటి? నాకు కోపం వస్తే ఇంట్లో అన్నం అంతా తినేస్తాను, ఎవరికీ లేకుండా. కాని కాంగ్రెసు వాళ్ళంటే నాకు చాలా సరదా. నీకు తగిన వాళ్లు వాళ్లే, నీతో సమంగా టెన్నిసు ఆడగలి గినవాడు ఎదురుగా నిలబడితే ఎల్లా ఉంటుందో అల్లా ఉంటుంది. నాకు కాంగ్రెసువాళ్ళంటే చాలా ఇష్టం." "ఇంకేద యినా మాట్లాడుదురూ. అస్తమానం అదే గొడవ. స్నేహితులు వచ్చినప్పుడూ అదే ?" అంది ఆమె.

"నాకు తెలియని విషయాలు మాట్లాడితే ఏం లాభం? అపయిని నీకంటే విసుగుగాని, అతను ఎప్పుడూ విని ఉండడు ఇవన్నీ" అన్నాడు అతను.

భోజనం అతనికి కొంచెం ఆశ గొలిపింది. ఎఱ్ఱగా వేగిన అరటికాయ చక్రాలు పంటి కింద కరకర నలిగితే అతనిదవడలు అనుకోకుండానే ఇటూ అటూ కదిలాయి. కమ్మగా కనబడే ఆ పెరుగు చల్లగా గొంతుక దిగుతూంటే వుండే సుఖాన్ని ఊహించుకుంటో అలాకూర్చున్నాడతను. తన గదిలో వదలి వచ్చిన చల్లటి కల్లురొట్టి, కాఫీ జ్ఞాపకం వచ్చాయి. అతనికి లోపల కొంచెం చలి వేసింది. తన 'ఆమె' కూడా జ్ఞాపకం

వచ్చింది. ఆ పెళ్ళి, ఆ పోలీసువాడుఅంతా.

వారిద్దరి భోజనాలు అయిన తరవాత సావడి లోకిపోతూఉండగాసగం తెరచి ఉన్న తలుపు లోంచి పడక గదిలోకి ఒక్కసారిచూశాడు. ఆ గదిలో అస్పష్టంగా పొగలాగ వెచ్చదనం అలుముకుని ఉంది. ముడత పడని, కొత్త, తెల్లని దోమ తెర, ఏదో దాచుకున్నట్టు వేలాడుతోంది. పందిరిమంచం పక్కని ఒక గుండ్రటి బల్లమీద లతలు అల్లిన గుడ్డ, దానిమీద పెద్దపింగాణీ పళ్ళెంలో అగరువత్తులచెట్టు. రెండువత్తులు మాత్రం వెలుగుతున్నాయి. పొగ చుట్టలు చుట్టలుగా గది అంతా ఒక పల్చని పొరలా అలుముకుంది. పాయలుగా చీల్చిన తమలపాకులు, చక్కపొడిభరణి ఒక వెండిపళ్ళెంలో ఉన్నాయి. ఆ బల్లకి సరిగా పయిని ఒక పెద్ద నిలువుటద్దం గదిని రెట్టింపు చేస్తూ వేలాడుతోంది. ఆ దోమ తెరలోపల మెత్తని పరుపూ, తెల్లని మెత్తని ఎత్తు తలగడాలూ, లతలు అల్లిన దుప్పటీ, ఊహించు కున్నాడు అతను.

ఆ గదికూడా అతనితో ఇల్లా అన్నట్టు అనిపించింది.

"ఇది నీకోసం కాదు. నీకు కావలిస్తే ఇల్లాంటిది ఇంకొకటి తయారుచేసుకో. ఈ తలుపు తెరిచి ఉన్నా నువ్వు ఇందులోకి రాలేవు. ఈ తెలుపు నీకు పడదు. ఈ పొగలో నీకు ఊపిరి సలపదు."

అతనికి హఠాత్తుగా మండు వేసవిలో ఉండాలనిపించింది. అనాచ్ఛాదితంగా చల్లని చెమట పట్టేటట్టుగా ఒక చెట్టుసీడని పడుకోవాలని. "భౌ, ఆ అ ఆ" అని అనుమానంగా మొరిగింది కుక్క. అతనికి సావడిలోకి వచ్చినట్టు జ్ఞప్తికి వచ్చింది. వేళ అతిక్రమించినట్టు తెలిసింది. ఇంక వారిద్దరినీ-ఒకరికోసం ఒకరిని సృష్టించినట్టున్న భార్యాభర్త లని- ఒకరి నొకరికి వదలిపోవాలనీ, వారిద్దరికోసమే ప్రత్యేకంగా సృష్టించిన ఆ గదిలో వెచ్చదనానికి వారిని వదలిపెట్టాలనీ కూడా తెలిసింది. శలవు తీసుకున్నాడు.

వారిద్దరూ చాలాసంతోషించారు. ఎప్పుడో తీరిక అయిన రోజున - తప్పక భోజనానికి ఉండిపోయేటట్టు రావాలని బలవంత పెట్టినట్లు చెప్పారు.

బయట రాత్రి కరుస్తోంది. రిక్షా పీకలోతు నీళ్ళలోలాగ ఎంతో ప్రయత్నంతో నడుస్తోంది. మళ్ళీ, ఆ మూసిన కిటికీలలోనుంచి వెలుతురు బయటికి ఊరుతోంది. మళ్ళీ కంటి యెదటే రెండు వరసల ఇళ్లూ చీకట్లోకి మాయమయి పోతున్నాయి. శూన్యంలో నుంచి కొత్తఇళ్ళు మొదట అనుమానంగా తరవాత స్పష్టంగా పుట్టుకొస్తున్నాయి.

పాదరసపు దీపస్తంభం ఎత్తుగా అల్లాగే నిలబడిఉంది, ఊదా ఆకుపచ్చతో లోకాన్ని పులుము తూను. ఆ దీపాన్ని చూస్తే అతనికి ఆకలి వేసింది. ఏదో కలలోంచి మేలుకొన్నట్టుగా, ఒక 'అరే

బియర్ నైటులో తిరిగి వచ్చినట్టుగా. సబ్ జైలులో కాంగ్రెసు వాడు జ్ఞాపకం వచ్చాడు. వాడు ఎందుకు నిరశన దీక్ష పుచ్చుకున్నాడు? కేవలం కడుపులో ఉడుకు- చేతకాని కడుపుడుకు. అంతకంటె ఏమీ లేదు. వీళ్ళూ వాళ్ళూ జేరి వాణ్ణి గొప్ప వాణ్ణి జేస్తారు. అధికార్లకీ వీడికీ మధ్య కొంతమంది కాళ్ళు విరగదొక్కుకుంటారు. చివరకి అధికార్లూ కొంత కంగారు పడి, సరే చూస్తాం అంటారు. ఆ మాట మీద వీడికి తిండి పెడతారు. ఇంతా జేసి ఫలితం ఏవో పది పంక్తులు. అసలు వాడనుకున్న ఫలితం ఎప్పుడూ రాదు. ఈ లోగా వాడుమాత్రం చీకట్లో పడి పైకి లేవడానికి తన్నుకుంటాడు. ఆత్మశుద్ధి, శౌర్యం, ధైర్యం ఇవేమీ ఉండవు. అంతా కల్పన.

రిక్షావాడు రిక్షా దింపాడు. అతను దిగిచూస్తే 'ఆమె' ఇంటికిముందు. కొంత తటపటాయించాడు.

అకస్మాత్తుగా అతని మనస్సులో ఒకగాలి వేసి పొగలా కొట్టుకు పోయాయి ఆలోచనలన్నీ. అతనికి విచారం లేదు. ఏదో పోగొట్టుకున్నట్టు అతని మనస్సు నొచ్చుకో లేదు. అతను పుట్టినప్పుడున్న ఆకలీ, అతను పెద్దవాడయి నప్పుడున్న ఆకలీ మాత్రం మిగిలాయి. మెట్లు ఎక్కి లోపలికి వెళ్ళాడు తన గదిలోకి.

అతను వదిలివెళ్ళిపోయిన కల్లురొట్టీ, కాఫీ అల్లాగే ఉన్నాయి బల్లమీద. గబగబా రొట్టె తిన్నాడు, కాఫీ తాగాడు, కొంచెం బలం వచ్చింది. అన్ని నిరశన వ్రతాలూ ఇల్లాగే ఆఖరు అవుతాయి అనుకున్నాడు. 'ఆమె' అప్పుడే నిద్రపోతోంది. చూశాడు. ఎంతో శ్రమపడ్డట్టు మత్తుగా ఆమె నిద్రిస్తోంది. శ్రమవల్లనే గావును, ఆమె ముఖం కొంచెం ఎఱ్ఱగా కందింది. ఆమె ఒంటరిగా దిక్కులేనట్టుగా, మనుష్యులులేని ఎడారిలోకి విసిరి వెయ్యబడ్డట్టుగా అతనికి కనబడింది. ఎంతో జాలివేసింది. ఇంతలోకే చలిగాలి, మూసిన కిటికీ తలుపుల మధ్య నుంచి కత్తిలా అతనికి తగిలింది. వెంటనే అతను పక్కలోకి దూరి ఆమె కప్పుకున్న దుప్పటీయె కప్పుకున్నాడు. తరవాత ఆమె వైపుకి తిరిగి ఆమెను గట్టిగా అదుముకున్నాడు — అతను తిన్న చల్లని కల్లురొట్టె, తాగిన కాఫీ, అతని కడుపులోకూడా మంచులా చల్లబరిచాయని. అతనికి నిద్రలో కలలు రాలేదు.

# చిరంజీవి పాటలు

౧

ఎవ్వ రున్నా రోయి
ఈ మాయరేయిలో
ఎవ్వ రున్నా రోయ్॥

లలితమ్మ తా నింక
పలుక లేనం దోయ్
తలపు తలపున నన్ను
పిలువబో కందోయ్ ॥,,॥

నీకు నేనూ నాకు
నీవు లే మందోయ్
మాటి మాటికి నన్ను
చాట బో కందోయ్ ॥,,॥

నీకు నాపై మనసు
నిలువలే దందోయ్
తిరిగి తిరిగీ నన్ను
మరచినా వందోయ్ ॥,,॥

ఏనాటి దైనాను
నేనె నీ కందోయ్
బ్రతుకు బ్రతుకున నన్నె
వెతుక మందోయీ ॥,,॥

౨

బ్రతు కొక పాటపై
పాడినదీ నా
బ్రతు కొక ఆటపై
ఆడినదీ॥

ఆకాశసీమలో
అందాల భూమిలో
తెలియని యెటనో
పలికిన నీకై
నా॥,,॥

పచ్చి పోనే పోని
పోయి రానే రాని
నీకొరకేనా
నీకొరకేనా ॥,,॥

ఇదియన్నా నదియన్నా
నెదియో నే నెరుగని నీ
వదికా దిదికా
వనియే నానా ॥,,॥

3

లలితా నన్నా
పిలిచెదవూ
పలుకని నీవా
పిలిచెదవూ॥

బ్రతు కెట కెటకో
పరుగిడెనా
నీ వెనువెంటే
రావలెనా ॥,,॥

చెరుగని కలపై
పరిగెదవా
విరిగిన యలపై
యరిగెదవా ॥,,॥

మాటా పాటా
మానెదరే
నీ వెనువెంటే
నిలిచెదరే ॥,,॥

### ౪

ఎట కేగెదమే
ఇటు నా అటు నా॥

నీవే నీరై
నేనే నావై ॥,,॥

నీవే గాలై
నేనే పాటై ॥,,॥

మనసే నీవై
మాటే నేనై ॥,,॥

నీవే నేనై
నేనే నీవై ॥,,॥

### ౫

ఏలనే ఈ బ్రతుకు
ఏలనే యేలనే॥

కూలిపోయిన మ్రాకు
ఏలనే చిగురాకు
రాలిపోయిన పూవు
ఏలనే ఈ తావి ॥,,॥

నడువజాలవి నీటి
నడుమ నీ పేరాస
విడువజాలని యాస
నడుమ నీ పెనుమంట॥,,॥

రాలేక పోజూచి
పోలేక రాజూచి
నడుమనే నీ యాస
విడువదో కంటావు ॥,,॥

### ౬

పదవే లలితా
పోదాం పదవే॥

ఇట నీ కెవరే
ఎటు లున్నావే ॥,,॥

ఇటు నటు చీకటి
ఇల్లే చీకటి ॥,,॥

అదిగో నదిలో
అది మన నావే ॥,,॥

ఆ దరి నేదో
అమృతాలాపం ॥,,॥

### ౭

ఎన్ని జన్మాలో
ఈ బ్రతుకు
కెన్ని జన్మాలో॥

కలలలో నా రూపె
లలితగా తోచి
లలితమ్మ రూపాలె
కలలుగా పూచి ॥,,॥

పూవులో నా లలిత
తావియై పిలిచి
పిలుపు పిలుపున నేనె
పిందెనై పలికి ॥,,॥

పండుదాకా పూవు
పయనమై పోయి
పూవు పండూ కూడి
తావియై పాడి ॥,,॥

౮

కలలు కల లన్నాను
లలిత లలి తన్నాను
కలలు లలితలె నాకు
కాల మన్నాను॥

తలపు లెరుగని నన్నె
కలలు కల లన్నాను
కలలు తెలియని నన్నె
లలిత లలి తన్నాను ॥,,॥

కలల మనసుల్లోన
కలదు లలిత న్నాను
లలిత నీడల్లోన
కలను నే నన్నాను ॥,,॥

లోకాలు ప్రాణాలు
ప్రాకినా నన్నాను
కాలాల జన్మాల
మాల నే నన్నాను ॥,,॥

౯

అల్లంత దూరాని
కనిపోయెనో యీ
మొగలివాసనె నాకు
నగ లన్న దోయీ॥

పొదలలో నే పాము
పొంచి చూచిందోయ్
లలితమ్మ దూరానె
నిలిచి యేడ్చిందోయ్ ॥,,॥

నిలిచి నా లలితమ్మ
నేల కొరిగిందోయ్
కన్నీటిలో చిన్ని
కల్వ పూచిందోయ్ ॥,,॥

ఒరిగి దేవుళ్లార
కరుణింప మందోయ్
అరపు అంచై తిరిగి
తిరిగి అరచిందోయ్ ॥,,॥

నీవు నేనూ లేని
తావు లంటో యీ
తావుల్లొ నాయంచ
దాగి వుం దంటోయ్ ॥,,॥

# ఇదం క్షాత్రం!

అత్తిలి సూర్యనారాయణమూర్తి.

పలుకని పెదవుల్లో
ఉలుకని వదనంలో
కదలే హృదయాలూ
సడలే భారాలూ
మొలపిస్తామూ!
విసురులు
తలపిస్తామూ!
మనసున ఉన్నది అంతా
అనుకొని చెప్పిన దంతా
త్రుటి ఒక్కటిలో
పలు కొక్కటిలో
విబ్బరంగా
అబ్బురంగా
కా దనిపించేస్తామూ!
ఔదల వంకి స్తాంమూ!
మేమే సాధువులం
మేమే క్షత్రియులం !
మెరిసే కళ్ళల్లోనూ
విరిసే నవ్వుల్లోనూ
పలుకే అమృతపుబిందై
మెలకువ వరాలగ్రంథై
నిలుకడ చూపిస్తామూ!
అలికిడి తప్పిస్తామూ!
మేమే సాధువులం
మేమే క్షత్రియులం

# అశ్రుతర్పణం

కందుకూరి రామభద్రరావు.

ప్రకృతి బహిరంతరములు తుపానురేగి
నా శరీరాంతరజ్యోతి నృగి నలిగి
పడతియును నేను బ్రతుకులు పారదెరచి
ఎంతగా దాచుకొన్న కొండెక్కిపోయె.

కరుణ రవ్వంత యున్న నాకమె కరంగ
హృదయమును జీల్చుకొని వచ్చు నెల్లుగుతోడ
పదివసంతాల స్వప్నకావ్యము ముగించి
అశ్రువులతోడ స్వస్తివాక్యమ్ము నిడితి

మధురజ్యోత్స్నాప్రసారసంపత్కరమ్ము
కలలు రేపిన చంద్రమఃకాంతు లంత
విహ్వలము లయి కన్నీరు విడువ దొడగె
భావసంశూన్య మైన ప్రపంచమందు.

పార్థసారథి బ్రదికిన పది దినాల్లు
పాలకడలి తరంగాల పైని మిసిమి
పండువెన్నెల రేకులోపలి పసందు
పైరగాలి హృదంతర పరిమళమ్ము.

అపుడు నే పూలపడవనై హర్షజలధి
నింగి దాకి తూగాడు తరంగపంక్తి
ముమ్మర మ్మగు రేకుల కమ్మదనము
చిమ్ముకొని పోతి నాశల చివర లొరసి

[మాబాబు పార్థసారథి పదేళ్ళవాడు టైఫాయిడ్‌తో బాధ పడి పడి పరమపదించాడు. "అశ్రుతర్పణము" చేస్తూ వచ్చాను. అందులో కొన్ని కణాలు నన్ను బట్టి వాడికి కూడా అభిమాన పత్రికైన "ప్రతిభ"కు పంపుకుంటున్నాను. —కందుకూరిరామభద్రరావు.]

ఇపుడు శ్రావణమేఘుడ; ఎడద బరువు
నీడ్చుకొనుచు, జీవిత పథ మూడ్చి చనుచు,
పిడుగుమ్రోతగ నేడ్చెదు, ప్రిదిలి దిశలు
ఆర్ద్రపంకము లయిపోయి అవని గలియ.

నా గృహారామసీమ జన్మమ్ముగన్న
తొలివసంత ప్రవాళ సంతోషమునకు
పురిటి బాలెంత పసుపులు విరిసిపోయె
పుట్టుపండువు వేడుక లుట్టి పడియె.

"పారిజాత ప్రసూన సంపద జనించె,
నందన వనమ్ము; ఇతడు పురందరు" డని
తోట నడుగిడు వారెల్ల తోచి యనిరి
పది వసంతాల మొగ్గయై పరిమళింప.

కడుపులో తేనె సోనల కడవ లెన్నొ
కూడబెట్టుచు నున్నది: కుసుమ దళల
హృదయ మాధురి నాను షట్పదకులమ్ము
లెంత కీర్తించునో యని యెగసినాము.

కాని, కనలేని దుర్విధి గర్వమంత
ఏదొ విషకీటక మ్మయి యేర్చి దొలచ
ఒక్క వేటొక రాలిపో నుడికిపోదు
కడుపుచుమ్మలు చుట్టు దుఃఖాన క్రాగి.

రాలుపడియెడు నెలుగుతో, చాలుకట్టి
యురలు కన్నీటి రొదలతో తిరుగ నేను
అడుగడుగు మొగ్గరాలిన తొడిమ రాచి
గాడువారిన యెడద రక్తమె స్రవించు.

బుగ్గల చొట్టలు
నిగ్గులు తేరగ
కలలో పార్థుడు
కలకల నవ్వేను—
బొండుమల్లె జడికురిసినది
పండుపున్నమియే విరిసినది
పాలకడలి యెద పొంగినదీ ము
త్యాలు రాసులై మొలిచినవి !!—
నిలిపి కవుంగిలి
నీ రయిపోయితి—
కన్నులు విడివడె—
కారురేయికొస!
సుప్తముద్రితము,
శూన్యప్రపంచము !!
నా కపోలముల
నయాగరాలై
పారు బాష్పముల
పాన్పె తడిసినది—

ఎదుటి గోడపై
ఏమి యెరుగనటు
కదలిపోవు నీ
ఘటీయంత్రమే!

ఎడద తేనియ లూరెడి నుడుల పూల
దోలికా పాళిలోన నుయ్యాల లూచి
పదివసంతాల బ్రదుకె నివాళి యిడిన
హృదయసారథికై యేద్వనేవి లేను.

ఒక్క క్షణమేని విశ్రాంతి దక్కనెంత
పెనగులాడిన వివశమై చనెడు కాల
చక్రవిభ్రమణంబుతో సాగిపోయి
ఊరకే పుత్తువట్టి నిట్టూర్పు గాడ్పు.

పొగులు చుండిన హృదయాస మిగిలియున్న
స్మృతిలతావితానమునకు చిన్నిపాదు
కట్టి, మనసార కన్నీరు గార్చ నాకు
తెరపి దొరకదు నవ్యనాగరక జగతి.

ప్రాగ్గిరికూటపు
ప్రభాతకాంతుల
పార్థుడు పట్టే కాహళు లవిగో
వినబడ లేదా! వినబడ లేదా!

కన్నులు తెరచే
కమలదళమ్ముల
పార్థుని పెదవుల చిరునవ్వదిగో
కనబడలేదా! కనబడలేదా!

పూలకన్నియల
బుగ్గలు నొక్కుచు
ఈలలు వైచే
బాలానిలుడై
పార్థుడు పాడే గేయా లవిగో
తెలియుట లేదా! తెలియుట లేదా!

ప్రభాతవాయు
ప్రసరణమ్ములో
పయోదమాలా
ప్రస్తారములో
స్వర్గవాహినీ
సైకతములలో
పార్థక్రీడలు: పార్థక్రీడలు !!

# విన్నపాలు

"చలం"

ఏమిటి అట్లా బిక్కమొహం వేసుకుని చూస్తావు? ఏమీ ఎరగనట్టు?

రాత్రింతా కళ్ళు వాచేట్టు ఏడిపించి పైగా!

నేనా?

నేనా? నిజం చెప్పు నేనా! నిన్ను ఏడిపించింది?

నలుగురూ ఏమంటారో అడుగు.

ఎవరికి తెలీ దనుకున్నావు నీ సంగతి?

నీ కఠినత్వం అనాదిగా అందరూ ఎరుగుదురు.

ఎందర్ని నమ్మించి వొంచించి చేరావో నా పాలిటికీ, నా ప్రాణాలు పిండడానికి!

రాత్రిరాత్రి నీకోసం వెయ్యికళ్ళతో వెతికే నక్షత్రాల నడుగు. ఏడుస్తో ఏళ్ళకి ఏళ్ళు ప్రవహించే నదుల్ని అడుగు. ప్రతిమూలా వెతుకుతో పరుగులెత్తే గాలి నడుగు. నీ ద్రోహాన్ని నమ్మలేక వెలవెల బోయే చందమామ నడుగు.

పైగా ఏ మెరగనట్టు బిక్కమొహం వేసుకుని నా మనసు కరిగేట్టు చూస్తున్నావా? ఎక్కడికి వెళ్లావు ఇన్నాళ్ళు?

ఏం అపరాధం చేశాను నేను, నన్నింత మోసం చెయ్యడానికి?

అవును.

నీ చూపులు నమ్మి, నిన్ను పొగిడిన నీ దొంగమిత్రుల మాటలు నమ్మి నిన్ను పిలిచిందే నాతప్పు.

'అయినా నేను పిలిచింది ఏముంది?

అదేపనిగా రాత్రింబవళ్ళు, వుత్తరాలు, కేకలు, కబుర్లు, కన్నీళ్ళు,

పడలేక సరే నన్నాను.

నామనసిచ్చిందాకా, ప్రతిదిక్కునా నీ చూపులే, ప్రతిశబ్దంలోనూ నీ కంఠమే, ప్రతి ఆశలోనూ నీ సహాయమే.

చీకట్లో ప్రతిమూలా నీ చేతులే.

ఇంక చాతకాక సరే నన్నాను.

అదా నా తప్పు.

ఈ ప్రపంచాన్నే ఎత్తి నా చేతుల్లో పెడతా నన్నావు, నక్షత్రాలనే గుచ్చి నా మెళ్ళో వేస్తా నన్నావు. "నేనే నీవాడనైనప్పుడు? నీ కింకేం కావాలి?" అన్నావు.

మరిచిపోయినావు.

నే నెట్లా మరవను నిన్ను? పువ్వుల వెనకనించి నీ నవ్వులు, మబ్బుల వెనకనించి నీ దోబూచులు, నా కన్నీళ్ళలో నీ నీడలు, నా సుఖాలలో నీ స్పర్శలు, నా నిద్దట్లో నీ రహస్యాలు.

ఎట్లా మరవను నిన్ను?

"నేనే నువ్వు' నిన్నెట్లా విడుస్తాను? హృదయంలోనే కట్టేసుకున్నావుగా. ఎట్లా వెడతాను?" అంటే నమ్మాను నీ దొంగ మాటలు.

ఎక్కడ వున్నావు?

నా మల్లే మోసపోయిన నిర్భాగ్యులందరూ వాళ్ళ ఏడుపులోంచి తలలెత్తి నవ్వుతున్నారు నన్ను చూసి.

ఎవరిది తప్పు భగవాన్, నువ్వు చెప్పు పోనీ అంటాడు చలం.

*　　　*　　　*

ఏమిటి నీవుద్దేశ్యం ఇట్లా వెంటపడి వేధిస్తావు? నలుగురిలో నాకు నవ్వులాటై పోయింది. ఎప్పుడూ కళ్ళువాల్చి ఏమాలోచిస్తావంటారు? నాలుగుదిక్కులు ఎవరికోసం అట్లా వెతుకుతావని వెక్కిరిస్తారు. ఏముంది ఆ చీకట్లో? నీకేం వెర్రి అని తిడతారు.

ఎవరు నిన్నింత నీరసపెట్టారు? కారణం లేకుండా ఆకన్నీళ్ళేమిటి? ఏంజరిగింది? అని గాబరా పడతారు.

ఏం చెప్పను? నీ పేరన్నా తెలీదు నాకు. ఎక్కణ్ణించి వొస్తున్నావో ఎరగను. ఎప్పటినించి నిన్ను తలుచుకుని ఎదురు చూస్తున్నానో మరిచి పోయినాను.

ఎక్కడికి పోయినా 'ఎవరు' అంటారు. ఏంచెప్పను? ఎట్లా చెప్పను.

వొదలవేం, ఇకనైనా!

పరధ్యాన్నం, పరధ్యాన్నం. ఒకటే ధ్యానం నీమీద.

కాని పరుడివా నువ్వు! ఒకటే నన్ను జెల్లించి మరిపించి, నా హృదయాన్నధిష్ఠించావు. ఇంకా పరుడి వని ఎట్లా అనను? ఎట్లా వొదల్చుకోను?

నలుగురూ కూచున్న సమయంలో కూడా కిటికీలోంచి తొంగి చూసి పిలుస్తావు. నా మాటలు తడబడతాయి. నా కళ్ళు నీళ్ళతో నిండుతాయి. వొణుకు పుడుతుంది.

ఏమిటంటే ఏం చెప్పాలో తెలీదు.

బావిలో నా ముఖాని కడ్డంగా నీ మొహం కనపరిస్తే, అమ్మవాళ్ళ అరుపుల్లో నీ ఆశవినపడితే, భోజనానికి బదులు నీ పెదవులు తగిలితే, చీకట్లో, వెన్నెట్లో, మబ్బులో, ఎండలో, ఇంట్లో, బైట, ఎక్కడా నువ్వు దాగులు మూతలాడితే ఎట్లా బతుకను? బతుకు నీరసమైతే!

అర్ధరాత్రి ఎవరికోసమో ఎదురు చూస్తో వున్నప్పుడూ నువ్వే వొస్తే.

నా సిగ్గు తీసేశావు.

నా వాళ్ళని కాకండా చేశావు.

ప్రతిపనికీ అడ్డం నువ్వు!

పొమ్మంటే పోవు.

చీవాట్లు, ఏడుపు, రోషం ఏవీ లక్ష్యం లేవు నీకు.

తిట్టినకొద్దీ మీదిమీది కొస్తావు. సిగ్గులేదు నీకు.

ఇంత ప్రపంచం వుండగా, నా కాళం ఎందుకు పట్టావు ఇట్లా?

ఎన్నో గొప్ప పనులు చెయ్యాలని, ఎంతో గౌరవం సంపాయించాలని, ఘనత కెక్కాలని నాప్రియత్నాలన్నీ ఏమైనాయి!

ప్రపంచమంతా నాకేసి తలెత్తి చూసేట్టు చేద్దామనుకున్నాను.

ఇప్పుడు సిగ్గు, పేరు, వూరు, రూపం, గుణం లేని ఇది ఎవరిని అడుగుతారనీ, ఏం చెప్పాలో నాకు తెలీదనీ, అందరూ నవ్వుతారనీ భయం.

"నువ్వు - నువ్వుకూడా చివరికి నువ్వూ, ఈ వలలో యీపిచ్చిలో పడ్డావా?" అంటారని అనుమానం. ఇంకేం మిగిలింది నాకు? నువ్వా!

నువ్వు నాకెందుకు!

ప్రితిమూలా దుమ్ములో, దారిలో, బిచ్చగాళ్ళలో, కూలివాళ్ళలో, పిల్లలతో, పిట్టలతో తిరిగి చవకబడ్డ నువ్వు నాకెందుకు? ఏం గొప్ప నువ్వు?

ప్రిపంచం నాకు కనబడకండా, ప్రిపంచానికి నేను కాకండా చెయ్యాలని నీవుద్దేశ్యం కానీ: తప్పించుకోడం నా చాతకావటం లేదు.

వొదిలి పోరాదూ నువ్వు!

'నిన్ను నేను వొదులుతానా నీ అంతం చూడంది?' అంటున్నాడు చూడు భగవాన్ అంటాడు చెలం.

# 'పాప' పద్యాలు

మనమైత్రి—

గుండె మీ దొక రాయిలా - కూర్చుం దీ తమస్సు
అంద విరిగి పడిందీ - అంధలోకంలో మనస్సు
ఆకాశ మయినా నా - కగుపడ్డం లేదు,
నాకోసం వెలిగించు ప్రియా - నీ కళ్ళలో ఈ రాత్రి
మన మైత్రి—

ఊపి రందని కౌగిలిలో - ఉప్పొంగిన ఉద్రేకం
నీ పరువంలో లయించిన - పాప మెరగని వివేకం
మృతినందిన నాకు రావు- మేఘగర్భంలోకంటా
ప్రతిధ్వనించే లాగ - పాడు ప్రియా! జీవదాత్రి
మన మైత్రి—

ఏమీ ఎరగని అమాయకత్వం - ప్రేమే అని అనుకున్నాం
ఆమనులు పుష్పించినప్పుడు - అంతులేని కలలు గన్నాం
అప్పుడు మన నిద్దరినీ - అతివాత్సల్యంతోటి
కప్పి కాపాడింది - కరుణామయి ఆ జనయిత్రి
మన మైత్రి—

ఒకరి కొకరం దూరంగా - ఒత్తిగిలి పోనే లేదు
వెకిలి ఈసు మనమధ్య - వెక్కిరించి పోబోదు
ఏది లోపించింది మనలో - ఎందుకో ఈ దారిద్ర్యం?
ఈ దురవస్థను బాపగలదా? - ఈ మహాజ్ఞానదాత్రి
మన మైత్రి?—

అనుక్షణం కలిసి ఉన్నా - కనబడదు ఆ ఆనందం
మనం ఎంత వినబోయినా - వినబడదు ఆ నినాదం
మనలో ఏ తత్వమో - మరణించిందేమో!
ప్రణయ చైతన్యం మనలో - రగిలించగలదా? అనలనేత్రి
మన మైత్రి?—

—ఆరా

## అసత్యాలు

నే నసలు కవిని గనకే
ఎన్న దెరగని ప్రణయినికే
మజా నించే పద్యాలు
పాడతాను
విజంకోసం అసత్యాలు
ఆడతాను
ఎందుకంటే నా గుండె లాక
ించు కోర్కెలకు పదా ల్లేక.

నేను పడని కష్టా లన్ని
నా భావనమీద కా ల్దన్ని
ఎంతో జాలిగా లోకానికి
తెలుపుకుంటా
వింత కలలలో మనికి
నిలుపుకుంటా
ఎందుకంటే నాలో జాలి
ఎల్లాగో కల్పించే చెప్పాలి.

వలపు లూరి నన్నాళ్ళు
ఏడ్పురాని కన్నీళ్లు
ఎన్నో కార్చి ప్రియురాలి
కరిగిస్తా
వెన్నెలలకు చలిగాలి
మరిగిస్తా
ఎందుకంటే పేరేలేని
ఆందోళనకు కన్నీళ్లే వాణి.

జగమంతా తుమ్మెదరెక్కలా
ఎగిరిపోతుం దన్ని పక్కలా
నాలో రేగని గాలివాన
విసురులో
కాలంతిరగని నభం పైన
ముసురులో
ఎందుకంటే నాలో వేదనను
ఇంతకంటే స్పష్టంగా అనలేను.

రూపంలేని నా వ్యక్తిత్వం
చూపడాని కీ వస్తుతత్వం
ఒకే ఒక్కసాధన మని
అనిపిస్తుంది
సకలమిథ్యల సత్యధ్వని
వినిపిస్తుంది
లోకాని కిదంతా అసహజం
నాకు మాత్ర మిదే నిజం నిజం.

# ఎందుకు

"భట్లు"

ఏడ్వాలా నే నేడ్వాలా
ఎందుకు నేనై ఏడ్వాలి

రాజ్యం పోతే రాజ్యాలు పోతే
మకుటా లన్నీ మంట కలిస్తే
దంభంపోతే దర్పంపోతే
హింసే చస్తే ఏడ్వాలా
ఎందుకు నేనై ఏడ్వాలి

ఏ మనుకున్నావు నా కన్నీళ్లు
వజ్రపు తునకలు ముత్తెపు సోనలు
అమూల్య మణులను వెదజల్లాలా
వెదజల్లాలా ధనసౌధాలే
కూలి నశిస్తే ఏడ్వాలా
ఎందుకు నేనై ఏడ్వాలి

సత్యం ధర్మం సొమ్మసిల్లితే
సౌందర్యమ్మే నీరసపడితే
ఏడుస్తా నే నేడుస్తాను.
బీదలకడుపులు ఏడుస్తుంటే
ఏడుస్తా నే నేడుస్తాను.

సతికనుకొలుకుల నీరు చిమ్మితే
ఏడుస్తా నే నేడుస్తాను.

సామ్రాజ్యాలే దగ్ధమ్మైతే
క్రౌర్య మూర్తులే నాశమ్మైతే
సాధుహింసకులు చస్తే చస్తే
ఎక్కడ ఉన్నాయి కన్నీళ్లు
ఎందుకు నేనై ఏడ్వాలి.

# నిర్ణయం

[ఏకాంకము]

శ్రీ కృత్తివాస తీర్థులు

ప్రథమరంగము

(సమయం: పొగమంచుతో కన్ను కనపడని వేకువ.

స్థలం : ఇంటిహాలు. అంతటా నిశ్శబ్దం. మూడు సంవత్సరాల కుర్రవాడు తడి మన్నుతో ఇల్లు కడుతూ వుంటాడు. హాలుకు కుడివైపు ఒక ద్వారం నేపథ్యం వైపు. వెనక ఒక ద్వారం వంటింట్లోకి. వెనక ద్వారం సగం తెరుచుకొని తల్లి ప్రవేశం.)

= తల్లి =

వొరేయ్! ఏమిట్రా మట్టితో ఆటలు!

= కుర్రవాడు =

అంతా మట్టే కాదమ్మా!

= తల్లి =

చాల్లే! అసలే ఇవాళ తెగ మంచుగా వుంది. దానికితోడు తడి మట్టితో ఆటలా? రొంప చేస్తుందమ్మా.

= కుర్రవాడు =

ఏం చెయ్యాదులే (తల్లి మన్ను లాక్కోబోతుంది, రాగాలు పెడతాడు. వెంటనే ఇచ్చి వేస్తుంది)

= తల్లి =

అన్నమాటల్లా చెల్లించుకోడానికి ఏడుపు చేతవు. వొంటిని చొక్కా తొడగబోతే తొడగనియ్యవు.

అన్నవేళల్లా వకటిగా వుండదు. తొడగనా చొక్కా?

= కుర్రవాడు =

పుట్టినప్పుడు నాకు చొక్కాలు లేవు.

= తల్లి =

చాల్లే.

= కుర్రవాడు =

నా వొంటి రంగు చూడమ్మా. నీలంగా ఆకాశంలా లేదూ? ఇంకా చొక్కా ఎందుకు?

= తల్లి =

బాగావుంది దిగంబరివి. (చొక్కా తెచ్చి తొడగబోతే తొడిగించుకోడు.)

= కుర్రవాడు =

అబ్బా నా కొద్దు చొక్కా.

= తల్లి =

ఇహా, నీకు కుటి స్తే వొట్టు. ఒహ ముద్దూ లేదూ మురిపెం లేదూ. అస్తమానం మన్నుతో ఆటలు. పక్కింటి వారి అబ్బాయిలతో ఆడుకో.

= కుర్రవాడు =

ఏ ఆటలాడినా మన్నుతోనే. మొన్న నే కాదమ్మా చిన్ని బింది, కడవ, మట్టితో చేసి

ఆడుకొన్నాం.

.............(తల్లివినుగు) నిష్క్రమణ.
అమ్మకి తెలీదు ఎంతసరదాగా వుంటుంది. కుమ్మరిలాకుండలు, బుంగలూ చెయ్యడం! కుమ్మరివాళ్ళఇంటికి పోతే కోపగిస్తుందిగద. ఎంచక్కా కుండలు బారులు తీర్చి ముద్దుగా వుంటాయి. ఏమన్నా అంటే 'కుమ్మరి వెధవై బతక'మంటుంది (తల్లిని పిలుస్తాడు. ప్రవేశిస్తుంది)

అమ్మా కుమ్మరి సీతయ్య ఇంటికి పోనా!

= తల్లి =

వొద్దు. సూద్రరాడివై బతుకు. వెళ్ళకు. వెళ్ళేవంటే వీపు చీరేస్తాను!

= కుర్రవాడు =

ఎలాగమ్మ మరి!

= తల్లి =

పారెయ్యి పాడుమన్ను.

= కుర్రవాడు =

పారేస్తాగాని ఇళ్ళు దేంతో కడతారమ్మా?

= తల్లి =

ఆఁ సున్నంతో.—ముందవతల పారెయ్యి మన్ను.

(పారేస్తాడు. బిక్క మొగం వేస్తాడు. తడిగుడ్డతో కుర్రవాడి చేతులు తుడుస్తుంది. లోపలికి వెడుతుంది. అలమారులో పేక ముక్కలు తెస్తాడు నవ్వుకొంటూ ఆటకు. పేకముక్కలతో ఇల్లు కడుతూండగా తల్లి ప్రవేశం.)

= తల్లి =

అదేమిట్రా నాన్నా! మీ నాన్నగారి కొత్తపేక తీసి పాడుచెయ్యకు.

= కుర్రవాడు =

పాడుచెయ్యక ముందు బాగుచేస్తున్నాను. చూడమ్మా ఈ ముక్కల ఇల్లు పడి పోయింది!

(పేక ఇల్లు పడి పోతుంది)

= తల్లి =

నీ చేతిలో అన్నివస్తువులూ పాడు.

= కుర్రవాడు =

చేత్తో చేసిన వన్నీ పాడు. రంగురంగుల పేక ముక్కల మేడ బాగుంటుందే. అవునుగాని పెద్ద పెద్ద ఇళ్ళు ఎవరు కడతారమ్మా?

= తల్లి = (వినుగు)

యిటు ప్రశ్నలు! మేస్త్రీ.

= కుర్రవాడు =

కట్టేవాడమ్మా?

= తల్లి =

తాపీవాడు! (నిష్క్రమిస్తుంది)

= కుర్రవాడు =

అయ్యో! పేకముక్కల ఇల్లు పడిపోయింది! పాపం ఈ రాజా రాణీలు చనిపోయా రేమో!

పడిపోయింది. కట్టినవన్నీ పడిపోతాయి! (పక పక నవ్వు. తెరవాలుతుంది)

ద్వితీయరంగము

(సమయం మధ్యాహ్నం. మబ్బుగా వుంది. అదే ఇంటిహాల్లో ఒకవైపు ఉయ్యాల. అందులో కుర్రవాడు మూలుగు. మధ్య మధ్య. తల్లి విచారంతో ఉయ్యాలదగ్గిర నిలబడుతుంది.)

= తల్లి =

వొద్దురా నాయనా అంటే విన్నాడుగాడు. తడిమట్టితో ఆడి, రోగం తెచ్చుకొన్నాడు. ఏం నాన్నా! తలనెప్పి తగ్గిందీ?

(మూలుగుతాడు.)

అయ్యో!...కబురుచేస్తే...రాడేండాక్టరు!.

= కుర్రవాడు =

అమ్మోయ్! కుమ్మరి! కుండలు! కాలుస్తున్నాడు!కాలువులో...కుండలు...ఫట్... ఫట్...బద్ద ..లవుతున్నాయ్! హ్వా..... హ్వా...(పలవరింత)

= తల్లి =

అయ్యో! తండ్రీ! ఏంచేతురా! (కళ్ళుచీర కొంగుతో వత్తుకొంటుంది. ఖంగారుగా కాలుకాలిన పిల్లివలె తిరుగుతుంది. ప్రవేశం డాక్టర్ తెల్లని దుస్తులతో గంభీరంగా)

= డాక్టరు =

ఎలావుందమ్మా?

= తల్లి =

ఏంచెప్పను!... వొఖడే వీడు... మీరే దిక్కు (చేతులు జోడిస్తుంది. డాక్టర్ కుర్రవాణ్ణి ఎత్తుకొని పరీక్షచేస్తాడు)

= డాక్టర్ =

జబ్బేమీ కనపడదు...అయితే... (అనుమానం) మరేం ఫరవాలేదు. నిర్ణయం ఎలాగో అలాగ...

= తల్లి = (ఆదుర్దా)

ఏం చెయ్య మన్నారు? ఏం చెయ్యను?

= డాక్టరు =

మీరేం చెయ్యక్కర్లేదు. వచ్చేదాన్ని మీరు ఎదుర్కోలేరు.

= తల్లి = (కళ్ళమ్మట నీళ్ళు)

...పలవరించాడండీ...

= కుర్రవాడు =

పైనంతా నీలంగా ఆకాశం. అంతుకనపడదు...ఏమిటో పాటలువినవస్తున్నాయ్! అలలు పాడుతున్నాయ్! హోరు మంటుంది...సముద్రం...... అదుగో గట్టు! అర్రెర్రె......కట్టిన ఇసిక ఇళ్ళు, గూళ్ళు పడిపోతున్నాయ్!...

= డాక్టర్ =

భయ పడకండమ్మా. నేను నా మనిషిని పంపుతాను.

= తల్లి =

ఇవి చేతులు కావు కాళ్ళనుకోండి. మీ బిడ్డనుకోండి (కళ్ళు వొత్తుకొంటుంది)

= డాక్టర్ =

అంతా నాకు బిడ్డలు. ఖంగారెందుకు.ఎలా జరగాలో, నిర్ణయిస్తాను. (గంభీరంగా)

[తెరవాలుతుంది.]

## తృతీయ రంగము

(సాయంత్రం చీకటి. ముసుగు. ఈదరగాలి. దీపం మినుకు మినుకు మంటున్నది. హాల్లో పేకముక్కలు, మట్టిబొమ్మలు మూల చిందర వందరగా వుంటాయి. ఉయ్యాల తాళ్ళు పట్టుకొని దీనంగా చూస్తున్నది తల్లి. జుట్టు చెదరిపోయింది. మాసి పోయిన చీరకట్టుకొన్నది. హాలుపక్క తలుపు తెరచుకొని నల్లగ ముసుగు వేసు కొని ఆజాను బాహువు అయిన 'వ్యక్తి' ప్రవేశం) (నిశ్శబ్దం కొంత సేపు...)

= తల్లి =

ఎవరా వచ్చింది?...

= వ్యక్తి =

డాక్టర్‌గారు పంపించారు. సమయం అయింది. వచ్చాను.

= తల్లి =

మందులు తెస్తున్నారా ?

= వ్యక్తి =

మనిషి చేసిన మందులా !

= తల్లి = (ఆశ్చర్యం)

అదేం !

= వ్యక్తి =

ఏంలేదు. నేనెవరో ఎరుగుదురా?

= తల్లి =

ఊహూ.

= వ్యక్తి =

తరుచుగా నేను అందరి ఇళ్ళకూ వస్తూ, పో తుంటాను మీరంతా నాకు పరిచయం.

= తల్లి =

మీా రెవరో కొత్త. ముందు నా కుర్రాణ్ణి... బ్రతికించండి.

= వ్యక్తి =

ఇలా ఇయ్యండి వాణ్ణి.

(తల్లి ఆశతో కుర్రవాణ్ణి ముద్దెట్టుకొని అందిస్తుంది. వ్యక్తి పిల్లవాణ్ణి ఎత్తుకొని ద్వారం గుండా నిష్క్రమించే సమయంలో దీపం ఆరిపోవాలి. హాలు తలుపు వేసిన చప్పుడు. ఆమెదీపం వెలిగించి, చేత్తో దీపం పుచ్చుకొని, వెర్రిగా భయంతో వెతుకు తుంది.)

= తల్లి =

ఏడీ...... అయ్యో తలుపు...తలుపు... (కొడుతుంది తలుపు) గొళ్ళెం పెట్టారే! అబ్బ తలుపు ఎంత చల్లపడ్డది? ఎంత నిర్దయ! (ఉయ్యాలతాళ్ళు పట్టుకొని కన్నీరు కారుస్తూ) ఈ తాళ్ళు! ఇవే మిగి...లి...నై (మూలకుపోయి పేకముక్క, బొమ్మ ముద్దెట్టుకొని చూచి పారేస్తుంది.) (తలుపు దగ్గిరికిపోయి తలుపు సందుకోసం వెతుకు తుంది) హాయ్యో! కనబడదు ! డాక్టర్ ! డాక్టర్ !.................

= సన్నని ధ్వని (మూలుగు) =

దూరంగా...పోతున్నానమ్మా...కుమ్మరి దగ్గిరికి...డాక్టరుగారు ...పిలుస్తున్నారు...

= తల్లి =

హా య్యో...తండ్రీ...తలుపురాదు...ఒక సారి ముద్దియ్యవా ? (తలుపును ముద్దెట్టుకొని) అబ్బ ఎంత చల్లన ! పెదిమిలు... కాలిపో ...నాన్నా నీ ముద్దులు ... ఈ ద్వారం...మీాద...(డగ్గుత్తిక) అబ్బా ! ఎవరా నల్లని...తియ్యండి తలుపు !

= మూలుగు =

రాకమ్మా...రాకమ్మా...రా... (గొంతు నులిమేస్తున్న స్వరం)

= తల్లి =

మన్ను...మన్ను ... తలుపురాదు! ... ఇదా...నిర్ణయం! (కఠినమైన ద్వారం స్పృశిస్తూంటే, జుట్టు చెల్లాచెదరై పోతుంది. చీరకొంగు ముఖాన అడ్డుపెట్టుకొని వెక్కి వెక్కి ఏడుస్తుంది. దీపం ఆరిపోతుంది)

(తెర మెల్లగా)

# వసంతము

## బాలగంగాధర తిలక్

నిదురలో నేమొ నాగుండె యదరిపడియె
సంత 'కె' వ్వని కనువిచ్చి యరసి జూడ
నాదు బ్రతుకెల్ల నను గాంచి నవ్వుచుండె!

రాత్రి కలలోన రా కుమారకు డెవండో
చనవు మీరిన పసిడి హస్తముల జాచి
పాలబుగ్గల మందార మాలపైన
ముద్దులిడె కొంటెనవ్వుల సుద్దు లనుచు.

వాలుజెడ మల్లె పూలెంత వలచినవియొ
ధవళ పరిమళ దేహ సుధామరీచు
లల్లన విరిసికొనె నొడలందు లేచు
పులక పులకకు నొక్కొక్క పూవుగాగ.

అబ్బ! తా నెంత వలపులో నలరినాడొ
కేలు గ్రహియించి పలికె నుయ్యాల గొంతు
నెచ్చెలీ, వత్తువా వెంట నేడు నీవు
ఏడు సంద్రాల యావల నెదురు చూచు
చెలువు టందాల చందాల సీమకడకు.

జంకులేకయె తెలినెల వంకనౌక
మబ్బు తెరచాపమాటుగా మసలుకొనుచు
నల్ల దాటు చుంటిమటె వారాశు లేడు
కొంగు కొంగుల గరిపి దిక్కులను మేము.

చంద్రికా శీతల మధుప్రసార సౌర
భమున నాయొడల్ పులకించి పసిడి జవ్వ
నంపు పరువంపు బరువు నా నయన యుగళి
గ్రమ్మె నీలాలుగా, నెలరాల సొగసు.

వరుని వీక్షణా చకిత త్రపాయతములు
తరళ హృదయ కాంచన పద్మ దళము లకట
ప్రియుని సాన్నిధ్య సౌందర్య వికసితములు
మోహ మోహన మురళి కామోదగతులు!

స్వప్న శాఖల శారికా సమితి మధుర
గాన మొసరించె తారకా గళములెత్తి
కులుకు వెన్నెలకెంపు నవ్వులను కరగి
రమణ రచియించె ముత్యాల రంగవల్లి.

చంద్రవంకలో వెన్నెల సౌరభమునొ
మొయిలు సిగలోన జాబిలి ముద్దునేమొ
కడలి గర్భమువీడి నాగాంగనలటె
ఫేనసుమహారములు పైకి విసరినారు.

వలపు తమకాన తెలినెలవంక నౌక
నిర్రి సవరించు నాకేల నిప్టె బట్టి
మర్రినీడకు లాగి ఆ మమత యేమొ
కౌగిలించెను భూనభములే కలియుచోట.

చూచి చప్పట్లు కొట్టిరి చుక్కచెలులు
నాగకన్యలు పెద్దగా నవ్వినారు
తేరుకోలేక, జడుపులో జారి విడియ
పడిన దక్కట నాదైన పాడుమనసు!

జాలిగా రాజు దిగలాగె సాచుకరము
చంద్రవంక నవ్వుచు తలక్రిందు లయ్యె
జారి పడెనంట రారాజు సంద్రమందు
తెల్లబోయిన నామోము తెలివితొలగె
వడకిపోయిన యెడద 'కై' వ్వనెను భీతి.

కోరికయె తీరని నాదు కునుకువోలె
దొరక బోనట్టి స్వప్నసుందరుని వోలె
నీ వసంతమ్ము వేయికోయిలలపాట
నా యెద నిలిపి బాధించు నవయ జేయు.

కూర్మి రా కుమారు డిడిన కౌఁగిలింత
మనసులోపల తీయగా మందుచుండె
నదరు గుండియ కిఁకమీద నిదుర లేదు
మరతునా మధుమాస సుమాల కలలు!

# అన్నీ ఇళ్లే

( బాలరసాల— )

ఉదయిస్తు సూర్యుడూ
ఉబలాట పడతాడు
పికిలి పిట్టలుకొన్ని
పెకలబడి పోతాయి
మిన్నెక్కి-కూర్చొనీ
మిటిమిట్టి చూస్తాడు
పడమటీ కొండలో
పడిపోవడా!
మునిమాపులేనిదే
ముందురోజెట్లా.

శీతల స్పర్శచే
సిగ్గు పోగొడతాడు
జోడుకోడై తాను
వేడివెల్గుకు ప్రాణ
పదమైన మిత్రమ్ము
పద్మినీకాంతకు
తలవంపు ఘటియించి
కనులు మూయిస్తాడు
పగటి వేలుపు యిళ్లె
పగను సాధిస్తాడు.

2

పండు వెన్నెలరేయి
నిండు జాబిలిచూచి
ఉల్లాసపడి తాను
ఉన్మాదమును పొంది
ఉప్పొంగి ఉప్పొంగి
ఉఱ్ఱూత లూగుచూ
అంతరీక్షము దాకు
అర్భటితొ అంబోధి
వీచి చేతులుచాచి
విస్తుపోతాడే.

ఉత్తేజమును పొందు
ఉదధి క్రేవల చూచి
కలువ కన్యలకు చ
క్కిలిగింత పెడతాడు

3

గెలిచాడు లోకాలు
విలిచాడు ద్రవ్యాలు
చింత చీకూ లేక
చూపుదా ఛేదాక
అన్నెపున్నెము త్రోసి
అన్ని నావే నంచు
అంకితము గొన్నాడు
నరుడు
మతకర్తలూ మహా
త్ములు చేయు బోధలు
చెవియొగ్గి వింటాడు
శిరము పంకిస్తాడు
చేతులూ జోడించుతాడూ
తనత్రోవ తా పట్టుతాడూ
తన నైజమే మానడూ

—శిగి

మిత్తినె త్తినమూగి
కుతక నొత్తేవేళ
జ్ఞాపకము తగులుతుందో
జ్ఞానమే కుదురుతుందో
ఉసురంచు అసురంచు
అసుల గోల్పోతాడు
ఉన్న లోకము తనకు
కన్నీటి బిందువౌక
కాను కిస్తుందా
కాల చక్రముతోటి
కదలిపోవాలీ
తిరిగిపోయిన ఆకు
తిరిగివస్తుందీ
కాలవాహినిలోన
కలసిపోవాలీ
పాతనీరూపోయి
కొత్తదొస్తుందీ.

4

ఆకర్షణీయతా
అతివ గుణమే యైన
కన్యగా తానుండి
అన్యహృదయము కోరదా?
స్త్రీపురుష బంధమ్ము
శాస్త్రీయ మైనపుడు
దాంపత్య ధర్మమే
తప్పు పటుతారా!
పుష్పంధయమున కే
పూపరాగపు భ్రాంతి
కొదమ తేటుల సొదలు
కుసుమములకే ప్రీతి.
సుకుమార సౌందర్య
సౌరభమ్ముల గూడు
ప్రసవహృదయము తేటి
ముసురలకు విప్పార
ఉభయత్ర స్వార్థమ్ము
ఉన్నదా లేదా!

స్వయమునకు ఏన్నెన్నొ
స్వాహాలు చేస్తూను
పరులయందే స్వార్థ
భావమ్ము చూచుటలు
సంకల్పములునూ
వికల్పాలు నూగా!
జరగి పోగానిట్లు
సృష్టి మర్మానికీ
సంతుష్టియేనా!
దేవుడో దయ్యమో
పాపమో పుణ్యమో
ఎంత చేసూకుంటె
అంత మహదేవా!

# ఆఖరు లేఖ

(కల్పిత కథ)

శ్రీమతి పద్మావతీ దేవి

పదేళ్లకిందట మొదటిసారి నిన్ను చూసినప్పుడు ఏందుకోగాని నా అప్తులలో నువ్వు ఒకదాని వని అనుకున్నాను. నీకు జ్ఞాపకముందా, అతి అప్యాయంగా మీ ఇంటికి రమ్మన్నావు; అప్పుడు నాకళ్ల వెంట నీళ్లు వచ్చాయి కాదూ, ఎందుకో! ఇన్నేళ్లకి ఇప్పుడు నీకు ఈ ఉత్తరము వ్రాస్తున్నాను.

ఇది చదివి నువ్వు నాకోసరము ఒక్క కన్నీటిచుక్క రాల్చు. ఈనాడు నా ఆనందం అంతా అగ్నిపాలయిపోయింది. అందరి కంటికీ నేను రాక్షసి గానూ, నీచురాలుగానూ కనపడుతున్నాను. అందరూ నాముఖం చూసి తప్పుకు పోయేవాళ్లే. ఇప్పుడు నావంటి నిర్భాగ్యురాలు ఇంకొకతె ఉండదు సుమా!

ఆరోజున నా నృత్యం చూడడానికి నువ్వు వచ్చి, అతి ప్రేమగా నాచేతులు పట్టుకుని, ఏంతో బాగుందని చెప్పినప్పుడు నా ఆనందానికి మేర లేక పోయింది. మళ్ళీ ఇంక నిన్ను చూసే అదృష్టము ఇంక నాకులేదు!

నా సంగతంతా నీకే నీకొక్కత్తెకే తెలియ చేయాలనే కోరి ఆశతో ఇదంతా వ్రాస్తున్నాను.

ఇది నీవు చదివేటప్పుడు నేను ఎక్కడ ఉంటానో! ఏలాగు మొదలు పెట్టను నా కథ!

నేను తలిదండ్రులచాటున పెరిగాను. ఒక్కదాన్నే కావడంవల్ల అతి గారాబంగా పెంచారు.

మా నాన్నకు చాలా చాదస్తము. ఆడపిల్లలకి పెద్ద చదువు రాకూడదనీ, వస్తే చెడిపోతారనీ, ఆయన నమ్మకము. అప్పుడప్పుడు అమ్మకి సహాయం చేయడం తప్ప నాకు ఇంకేమీ పని ఉండేది కాదు. నేను నాలుగుగోడలు దాటి తరుచు ఎక్కడికీ వెళ్ళేదాన్ని కాను. ఇరుగు పొరుగు వారు రావడమైనా అట్టే ఉండేది కాదు. నాన్నకి ఇష్టంలేని పని చేయడం అంటే చాలా భయం ఆ రోజుల్లో.

ఇలాగే పదిహేనేళ్ళు గడిచాయి. నాకు పెళ్ళి సంబంధాలు వెతుకుతున్నారు కూడాను.

పెళ్లంటే పట్టుచీరెలూ, నగలపెట్టీ అని నా ఊహ ఆ దినాల్లో. అమ్మ నాన్న పెళ్లి సంగతులు మాట్లాడుతూంటే పొంచి వినేదాన్ని. దేవుడి గదిలో అమ్మవారి పటందగ్గిర కూచుని, త్వరగా పెళ్లికావాలని ప్రార్థించేదాన్ని.

ఇంతలో ఒకరోజున అమ్మ ఎక్కడికో వెడుతూ తనతో రమ్మని పిలిచింది. అవువెంట దూడలాగే అమ్మవెంట వెళ్లాను. రెండుసందులు తిరిగాక మూడోసందులో ఇల్లు. ఇనప ఊచల తలుపులు ఆ ఇంటికి. ఎందు కివన్నీ; పిచ్చిగా వ్రాస్తున్నాను కదూ! నిజంగా ఆ ఇల్లు పక్షిని బంధించే పంజరం లాగ ఉంది సుమా!

లోపలికి వెళ్లాము. ఒకమూల గదిలో ఇద్దరు ఆడవాళ్లతో కూచున్నాము. అమ్మ వాళ్లతో ఏవేవో సంగతులు మాట్లాడుతోంది. నేను మాత్రం నాలుగు పక్కలా చూస్తూ కూర్చున్నాను.

ఇంతలో గజ్జెల చప్పుడు, పాటలూ, వినబడ్డాయి. అవి వింటూండగా, నా కేదో చిత్రమైన తన్మయత కలిగి, నన్ను కదిలించింది. చటుక్కున లేచి కిటికీ తలుపు తెరిచి, తొంగిచూశాను.

అబ్బ!

నా ఈడువాళ్ళు నలుగురు అమ్మాయిలు పైట కొం

గులు నడుముకి బిగించి, గజ్జెలు ఘల్లు మనేటట్లు అడుగులు వేస్తూ, చేతులుతిప్పుతూ, ఎంతో ఆనందంలో ఉన్నారు. ఏం చెప్పను నీకు, అప్పటి నా బాధ! బాధో, ఏదో అది! వీలు లేకపోయింది కానీ ఆ క్షణాన నేనూ వాళ్ళతో కలిసిపోయి, గజ్జెలు కట్టుకుని, గంతులు వేయా లనిపించింది.

ఆ పిల్లల పక్కన ఒకాయన ఉన్నారు. నా కళ్ళు అటు తిరిగాయి. అందమైన విగ్రహం తీర్చి చెక్కినట్టుంది.

నా కళ్ళు అటునించి తిప్పలేక పోయాను. ఎన్నడూ లేని కోరికో, ఆనందమో, ఒక వింతమార్పో అప్పుడు నాలో కలిగినది.

ఇంతలో నాట్యం నేర్పుతున్న ఆయన నన్ను చూసి నాట్యం నిలిపి, మేము ఉన్న గదిలోకి వచ్చారు. గుమ్మం దగ్గర నిల్చుని మంచినీళ్ళు అడిగారు. అమ్మ మాట్లాడుతున్న ఆమె అతి భక్తిగా లేచి వంటగదిలోకి వెళ్ళి గ్లాసుతో నీళ్ళు తెచ్చి కిందపెట్టి, నన్ను ఇవ్వమంది. నేను అమ్మవంక చూశాను. ఇయ్యమని సంజ్ఞ చేసింది. ఎందుకోగాని, కాళ్ళు వెనక్కి ఈడ్చినట్లైంది. చేతిలో గ్లాసు కిందపడి పోతుందో ఏమో అనుకున్నాను. నీళ్ళు తొణికి చాలావరకూ వొలికి పోయాయి.

నా చేతిలోనుంచి గ్లాసు తీసికొంటున్నప్పుడు నా వేళ్ళకి ఆయనచెయ్యి తగిలింది. అనుకోకుండా ఆయన ముఖంవైపు చూశాను. నీళ్ళు తాగడం లేదు. గ్లాసుమీదనుంచి నన్నే చూస్తున్నారు. భయంవేసి పారిపోవా లనిపించింది. అడుగు వెనక్కి వెయ్యలేక పోయినాను. నా కళ్ళు ఆయన వైపునుంచి తిప్పలేక పోయినాను.

ఆయన గ్లాసు ఇస్తూ మళ్ళీ నాచేతిని తాకుతూ "నాట్యం నేర్చుకుంటావా?" అన్నారు మెల్లిగా. ఏం చెప్పాలో తెలియలేదు. అలాగే అన్నట్టు తలూపాను. నవ్వుతూ ఆయన వెళ్ళిపోయారు.

ఆ నవ్వు, ఆ చూపులు, అబ్బా! ఆనాడు నేను ఆయోమయురాలిని అయినాను.

గ్లాసు తీసికొని వెనక్కి నడిచాను. అమ్మ, ఆమె రహస్యంగా మాట్లాడుకుంటున్నారు.
గ్లాసులో మిగిలిన నీళ్ళన్నీ తాగాను.

మళ్ళీ ఆ కిటికీ తెరిచి చూస్తూ అలానే కదలలేక పోయాను. అమ్మ వచ్చి "ఇంక రా" అంది. ఆమాటతో నాతల బద్దలైనట్లైంది. లోపల గుండె కింద కెక్కుతకో పడిపోతున్నట్లైంది. ఇష్టంలేకపోయినా కదలడం తప్పనిసరి అయింది.

అది మొదలు నాలో మార్పు. లోపల ఎప్పుడూ చిత్రమైన కోరిక రగులుతూ ఉండేది. సుఖంగా ఉంటూ, బాధగానూ ఉన్నట్లుండేది.

నాకళ్లముందర ఎప్పుడూ ఆయన నాట్యం నేర్పుతూ ఉన్నట్టూ, గ్లాసుమీదనుంచి చూస్తూ ఉన్నట్టూ, "నాట్యం నేర్చుకుంటావా" అని అడిగినట్లూ, ఆదోలాగ నవ్వినట్లూ, నా హృదయాన్ని తిరిమి తరిమి, స్థిమితంగా ఉండనీయలేదు. నాపని ఇంక అయిపోయినట్లు నాకు తెలిసింది.

నాన్న అంటే నాకు సామాన్యమైన భయంకాదు. అదికూడా నన్ను ఆపలేక పోయింది. అమ్మకి అబద్ధాలు చెప్పి ఏదోవంక పెట్టి ఆ ఇంటికి రోజూ వెళ్లేదాన్ని. దూరాన్నుంచి అయినా ఆయన్ని చూస్తేచాలు. గజ్జెల చప్పుడుతో కలిసి ఆయన గొంతు వినపడితే చాలు. ఒళ్ళు తెలియకుండా ప్రవర్తించేదాన్ని కాబోలు! అందరికీ ఎలాగ కనబడేదాన్నో! ఎన్ని అబద్ధాలు చెప్పేదాన్ని! ఎన్నెన్ని ఆలోచనలు నేర్చుకున్నాను! ఏదో తెలియని వేడి, వేగమూ, శక్తీ, జ్యోతీ నాలో ప్రవేశించినవి.

ఆయన నటరాజస్వామి, నాస్వామి!

రోజూ రోజూ ఆ ఇంటికివెళ్లి పూల మాలలు గుచ్చి, ఆమెకు ఇచ్చి రావడం క్రమంగా అలవాటైంది. దండలు కట్టడంలో నాకున్న నేర్పు మరెవ్వరికీ లేదని అంటూంటారు.

ఒకరోజున మామూలుగా ఆఇంటికి వెళ్లాను. ఇంట్లో ఎవ్వరూ లేరు. నిశ్శబ్దంగా ఉంది. అడుగులు

భారంగా వేస్తూ అంతకంటె బరువుగా గుండె కొట్టుకుంటూ ఉంటే, లోపలికి వెళ్లాను. అలవాటైపోయింది. పూలతట్ట ముందర పెట్టుకుని కూర్చున్నాను. ఏ పూలు కడుతున్నానో, ఎలా కడుతున్నానో నాకే తెలియదు. ఇంతలో నా గుండె గొంతుకులోకి అడ్డంగా వచ్చినట్లయింది. ఎవరో వచ్చినట్లయింది. కట్టినదండ ఊడిపోతూంది. పరధ్యానంలో సరిగా కట్టలేదని అప్పుడు తెలుసుకున్నాను. ఇంతలో నా పక్కన ఆయన ప్రత్యక్షమయ్యారు! నా హృదయము పొంగిపోయిందో, ఆగిపోయిందో!

ఆపూలతో నాస్వామి పాదాలని పూజించాలని అనిపించింది. నా హృదయ భారం ఆయన పాదాల మీద దిమ్మరించాలని అనిపించింది.

ఆయన నాదగ్గరగా కూచుని నాముందర ఉన్న పూలతట్ట అవతలకి తీసి నన్ను ఒళ్లోకి తీసుకుని గట్టిగా హత్తుకున్నారు. అలా వాలిపోయాను. అదే ఈ రోజున మళ్ళీ తల్చుకుంటూ కళ్ళు మూసుకుంటున్నాను.

ఎవరో ఏమిటో ఎందుకో ఏమి ఆలోచించకుండా నాస్వామికి నాహృదయం అర్పించి ఆ రోజున పువ్వులతో పూజించాను.

"నృత్యం నేర్చుకుంటావా? ఎంత బాగున్నావు!" అన్నారు.

"వస్తావా?" అన్నారు మళ్ళీ.

నాకు మాట రాలేదు.

"చెప్పు మరి" అని బుజ్జగించారు.

నేను కరిగిపోయాను, కదిలిపోయాను. ఆయనతప్ప ఈ ప్రపంచంలో నాకు ఏమీ లేదనీ, ఏది చేయమన్నా చేస్తాననీ చెప్పాను.

ఇంకా నా మాటలు పూర్తి కాకముందే నన్ను మరీ దగ్గిరిగా తీసుకుని నువ్వు నాపార్వతివి; నువ్వే నువ్వే అని తొందరగా అన్నారు. నేను ఆకులాగా కదలిపోయాను.

ఇంతలో బయట సందడి విని ఆయన లేచి వెళ్ళిపోయారు. చెదరిన పువ్వులన్నీ కూడదీసి నాచీర సర్దుకునేలోగా ఆమె వచ్చింది సుశీల.

అయ్యో పువ్వులన్నీ ఇలా కలిసిపోయాయే అని బొంక అరఘంట కట్టేపూలు అయిదు నిమిషాలలో కట్టి మా ఇల్లు చేసుకున్నాను.

ఆరోజుల్లో నామనస్సులోని ఊహలు వ్రాయలేను. ఎన్ని ఎన్ని ఆలోచనలు ఎప్పుడెప్పుడు వచ్చినా అన్నీ తోసివేసి, చివరకి మిగిలేది మళ్లీమళ్లీ ఆయన దగ్గరకు వెళ్ళాలనే.

ఒకనాడు పువ్వులు తీసుకుని వెళ్ళాను. లోపలికి వెడుతూంటే గుమ్మంలోనే ఆయనదర్శనం అయింది. ఆయన కళ్ళు పెదవులు కూడా నవ్వుతున్నాయి. నేనూ నవ్వాను. ఆయన పక్కనించే ఇంట్లోకి వెళ్ళాను.

ఆమె దేవుని మందిరం శుభ్రంచేస్తూంది.

నేనూ సహాయానికి వెళ్ళాను. ఇంతలో ఎవరో పిలిస్తే ఆమె లోపలికి వెళ్లింది. నాకాళ్ళ దగ్గిర ఒకచీటి పడింది. ఎక్కడనుంచి పడిందో అని తలెత్తాను. ఎదురుగా ఆయన.

చీటీ దాచాను.

మామూలుగా దండలు కట్టి త్వరగా ఇల్లు చేరుకునీ, గదిలో తలుపు బిగించీ చీటీ తీశాను. "రాత్రి 10 గంటలకు చెరువు దగ్గిర శివాలయానికి రా" ఇంతే అబ్బా! ఎన్నిసార్లు చదువుకున్నానో నాకే తెలియదు.

ఆజ్ఞ ఇది. ఆయన కెదురుచెప్పగలనా! ఏమైనా వెడతా - వెళ్లాలి. వెళ్లిపోతాను! ఇదే తోవ నాజీవితానికి ఇంక. నేను నిశ్చయించుకున్నాను. వెళ్లిపోతాను. ఆయనకు నేను కావాలి, నాకు ఆయన కావాలి.

శివాలయందగ్గిర కాదూ! అయితే నేను పార్వతిని, ఆయన శివుడు. పార్వతి శివుణ్ణి విడిచి ఉండ కలదా! ఆరాత్రే అన్నిబంధాలూ తెంచుకుని, నిద్రలో ఉన్న అమ్మకీ, నాన్నకీ ఆఖరుసారి నమస్కారంచేసి

అమ్మవారికి ప్రదక్షిణంచేసి, కట్టుకున్న బట్టతో బయటికి వచ్చాను.

ఆ చెరువుగట్టున ఉన్న శివాలయము నా కోసమే కట్టించారు అనిపించింది. శివుని ఆజ్ఞే వచ్చింది అని పించింది.

ఇల్లువదలి వచ్చాననే కాదూ తప్పంటారు అంద రూను? నువ్వు అందరిలాగా అంటావా? నీ ఖర్మం, పొమ్మంటావా?

శివుని ఆజ్ఞ తప్పు అవుతుందా?

ఆరాత్రి నాకోసము అలాగ కనిపెట్టుకునిఉన్నారు. ఆ చీకట్లో నేను కనపడగానే ఎదురుగావచ్చి నా చెయ్యి పట్టుకున్నారు.

అంతే.

బొంబాయిలో మేము ఇద్దరమూ భార్యాభర్తలుగా ఉండేవాళ్ళము.

ఉన్నట్టుండి అందర్నీ వదిలి వచ్చివేసిన బాధ అప్పు డప్పుడు వచ్చినా ఆయన్ని చూడగానే వెంటనే అన్నీ మరిచిపోయేదాన్ని. ఒక్క నెలలో నాలో ఉన్న శక్తి ఒక్కమారుగా పైకి ఉబికి నట్లయింది. నాట్యం నేర్చుకున్నాను.

నా స్వామి సేవ, నాట్యము - ఇవే నా జీవితానికి మార్గాలనుకున్నాను. అనేక పట్టణాలలో నాట్య ప్రదర్శనాలకి వెళ్ళాము.

ఎంతజనము - ప్రతీనిమిషము ఆయన నాకు ధైర్యం ఇచ్చేవారు. ఒక్క నిమిషమన్నా నన్ను విడవక నాకుఅండగా నిలిచి అందరి ఆహ్వానాలూ అందు కునే వారు.

ప్రదర్శనాలు కాగానే ఇద్దరూ రావాలని మాకు పిలుపులూ, సన్మానాలూ. ఆయన పక్కన బొమ్మ లాగా నిలబడడం తప్ప నాకు ఏమీ తెలిసేది కాదు.

ఇలా రెండు సంవత్సరాలు పరుగెత్తాయి. అప్పు డప్పుడు అడిగేదాన్ని, పెండ్లిచేసుకోమని, పెండ్లి అయితే ఇంకా నాకు గౌరవము పెచ్చుతుందని. ఇంక ఉదయమూ, సాయంత్రమూ, ప్రతి నిమిషమూ కూడా అడుగులు వేయడంలో, హస్తం తిప్పడంలో అంతా నాకే రావాలన్న శ్రద్ధ ఆశతో ఆవేశంతో అదే ధ్యానంలో ఉండేదాన్ని.

అలా ఉంటూఉండగా నాకు జబ్బు ప్రారంభ మయింది, తరుచూ జ్వరము, వాంతులు, బద్ధక మూను. ప్రతి ఊళ్లో మా నాట్య ప్రదర్శనాలు అవు తూనే ఉండేవి. ప్రదర్శనాలు ఆగిపోతే మాకు గడిచే మార్గంలేదు. అది తెలుసుకుని నా బాధలు ఆయనకి చెప్పేదాన్ని కాను. నా ఒళ్ళు ఏలా ఉన్నా సరే ప్రదర్శనాలలో పాల్గొనేదాన్ని.

ఒక రోజున ఆయనతో నాలో మార్పు చెప్పాను. ఆయన తెల్లపోయారు. ఇంక ఆరునెలలకి "పిల్ల తల్లివి కాబోతున్నావు" అన్నారు.

ఎంతో ఆనందంతో ఆయనకేసి చూశాను. ఆయన ముఖంలో జవాబు లేదు. నిట్టూర్చి లేచివెళ్ళిపోయారు. ఆరోజు నుంచీ ఆయన నాకు దూర దూరంగా పెడ ముఖంగా ఉండేవారు. దానికితోడు నాట్యం చేయా లనే కోరిక నాకు తగ్గిపోయింది. ఆయన ధోరణి అర్థంకాక కుమిలి కుమిలి ఏడ్చేదాన్ని.

ఈ విధంగా ఆరునెలలు గడిచాయి.

సినీమాలో మా నాట్యం కావాలని అడిగారు. డబ్బు వస్తుందని నాట్యానికి ఒప్పుకున్నారు, నేనూ సరే అన్నాను.

'మోహినీ భస్మాసుర' నాట్యానికి తయారయ్యాను. బలిసిన నా నడుముకి బలవంతంగా పటకా బిగిం చారు.

ఆయన నవ్వితే చాలు అనుకుని బాధ అయినా సరే ఒప్పుకున్నాను. అసలు ఆయన ఏం చెప్పినా కాదన లేను. అన్ని ఘంటల ప్రదర్శనం ఆ రాత్రి ఏలా అయిందో నాకే తెలియదు. ఎన్నడూ నేను అంత అలిసిపోలేను. అంత చితికిపోలేదు.

తరవాత ఇల్లుచేరాక నరకబాధ! అదివరకు ఎన్నడూ

మందు తెరగను నేను. ఆ రాత్రినించీ డాక్టర్లు, మందులూ ప్రారంభము. ఇంక క్రమక్రమంగా ఒక్కొక్కప్పుడు కొన్ని కషాయాలు ఇచ్చేవారు. అవన్నీ నా ఆరోగ్యానికని నమ్మి తాగేదాన్ని. నాచిన్ని పాపని నాలోంచి వేరు చేసేందుకని నాకు తెలియదు.

నాకు నెలలు నిండినకొద్దీ అయనకు కోపము, విసుగూ హెచ్చి పోయాయి.

నామీద ఆ ప్రేమఅంతా ఏమయిందో తెలియక, లోలోపల ఏడ్చి ఏడ్చి కుంగిపోయేదాన్ని.

ఒకరోజున అయన నా దగ్గరగాచేరి "నామాట వింటావా?" అని ఎంతో దయతో అన్నారు. సరే అన్నట్లు తల ఊపాను.

"ఏదయినా సరే" అన్నారు.

"సరే" అన్నాను.

"కాదనరాదు సుమీ" అన్నారు.

"మీమాట ఎప్పుడైనా తప్పానా?" అన్నాను.

"పిల్లఉంటే మనకి కష్టము. పుట్టేపిల్లని ఎవరికన్నా ఇచ్చివెయ్యాలి" అన్నారు.

అప్పుడు నేనేమయ్యానో తెలియదు. ఏ జవాబు చెప్పలేక ఊరుకున్నాను.

నా మౌనంచూసి అయన లేచివెళ్ళారు.

అప్పుడప్పుడు కదులుతూన్న నా పాప నన్నేదో పలకరిస్తు ఉండేది. భావికాలాన్ని గూర్చి నాకు ఎన్నెన్నో సందేశాలుఇచ్చేది. మా ఇంట్లో పనిచేసే దాసీ మూడునెలలునిండని పసికూనని తెచ్చి మధ్యమధ్య పని ఆపి పాలిచ్చి ఆనందపడుతూంటే, నా పాప నన్నుకూడా మరీమరీ పిలిచినట్లయ్యేది.

ఏమయినాసరే, నా పాపని ఎవరికీయీయను ఇయ్యలేను! ఇది నిశ్చయించుకున్నాను.

ఆరోజున నా స్వామికి నెమ్మదిగా చెప్పాను.

"నాకు పాప కావాలి, వదలలేను" అని.

"వదలకపోతే నాట్యానికి వీలులేదు. అదీగాక పెళ్ళికాని మనిద్దరికీ పిల్లేమిటి! ఆపిల్లకే నలుగురిలో నవ్వుపాట్లు" అనీ కోపంగాలేచారు.

అదే మొదటిసారి నా స్వామికి నా మీద అంత కోపంరావడము. గడగడలాడిపోయాను.

"నాట్యంవద్దు, పాప కావాలి" అని కాళ్ళమీదపడి ఏడ్చాను. ఆయనకి దయ వస్తుందేమో అని ఆయన నన్ను తోసివేసి చివాలున వెళ్ళిపోయారు. సాయంత్రందాకా ఇంటి పక్కకే రాలేదు.

ఇంక ఆ రోజు మొదలు సుఖమయమైన నా జీవితము దుఃఖంతో నిండిపోయింది. అయ్యో! ఈపసిపాపని ఈశ్వరుడు నాకే ఇయ్యాలా! ఏంచెయ్యను! ఎక్కడికిపోను! ఎవరితో చెప్పుకోను!

చిత్రం! ఈ వేదనతో నా నరాలు తెగిపోలేదు.

ఆరాత్రి అయన వచ్చారు. మళ్ళీ అడిగాను. వెర్రిగా బతిమాలాను. ఉండబట్టలేక చాలా ఏడ్చాను. కడుపులో పాప పలకరిస్తూనే ఉంది. మళ్ళ ఏడ్చాను. ఆయన మాత్రము కరగలేదు. ఎలా అన్నానో, ఇంక లాభము లేదని తెలిసి "ఇచ్చేస్తాను" అన్నాను గుండె పగిలేటట్లు ఏడుస్తూ. వదన్నట్లు పాప కదిలింది. ఆమాట వినగానే సంతోషంతో లేచి అతి ప్రేమతో దగ్గరకు తీసుకున్నారు.

మర్నాడే ఆస్పత్రికి తీసుకెళ్ళారు. పురుడు వచ్చే రోజులని తెలిసింది.

నన్ను వదుల్చుకుంటేనే చాలు అన్నట్లుగా ఆస్పత్రిలో వదిలి, ఆయన వెళ్ళిపోయారు.

అబ్బా! అసహాయురాలనైన ఆ నాటి నా బాధ ఎవరికైనా అర్థం అవుతుందా!

మరి వారంలో ఆడపిల్ల. ఎంత బాగుందని నా కన్న తల్లి! గుండెలకి అదుముకున్నాను. నర్సువచ్చి పాలు ఇవ్వవద్దంది. "అందరూ ఇస్తున్నారే" అన్నాను. "నీ పిల్లని ఆస్పత్రి వాళ్ళు తీసుకుంటారు" అని నవ్వుతూ అంది.

ఒక్క—మాటు నా గుండెల్లో పోటుపొడిచి నట్లయింది. నా పాపని చూసి మురిసే ఆనందంలో జరిగిన దంతా మరిచాను.

ఎవరితో చెప్పను నాకు పాప కావాలని! ఎవరిని అడగను నా పాపని నా కియ్యమని! ఆయన నా పక్క—కే రాలేదు.

నాపక్క—న తల్లులు అందరూ పసిపాపలకి పాలిస్తుంటే నా నరాలు కుంగి పోయేవి. తల అగ్నికుండం అయిపోయేది. ఆనర్సుకి నన్ను చూస్తే నవ్వు. రాక్షసి!

నాదగ్గర నించీ నా పాపని విడదీయాలని వచ్చింది. అది చూడకుండా పాలు ఇచ్చేదాన్ని. ఇంతలో అది దిగేది. కసిరి నా పాపని నాచేతుల్లోంచి లాగి తీసుకుపోయేది. నా చిన్నతల్లిని నాకంటికైనా కనపడకుండా దాచేది. అది పని తొందరలో ఉండగా పరుగెత్తివెళ్ళి దొంగతనంగా తొట్టిలో పాపను తెచ్చుకుని పక్క—లో వేసుకునేదాన్ని. నా పాపని నాఒళ్లో పెట్టుకునేందుకు నాకు భయమూ దొంగతనమూనూ. నాకు ఏడుపు వచ్చేది. అక్క—డ అందరికీ నామీదే కళ్ళు.

అసలు నా అనేవాళ్ళులేని నన్ను చూస్తే అందరికీ అలుసే.

ఒకనాడు నాచిన్న తల్లి చిన్నచేతుల్ని నా హృదయానికి హత్తుకుని నిన్నెవ్వరికీ ఇవ్వనని అర్థమయేట్లుగా చెపుకున్నాను. ఇంతలో వచ్చిందినర్సు. నాపాపని గట్టిగా పట్టుకుని "ఇయ్యను" అన్నాను. అ! అని ఒక్క—తోపుతోసి నాపాపని లాక్కు—పోయింది. మళ్లీ నాపాపని నేను చూడలేను. అదే ఆఖరు. అరాత్రే నన్ను విడిచి ఉండలేక కాబోలు నాచిన్న తల్లి ఏక్క—డికో వెళ్లి పోయిందిట, పోయిందిట.

అబ్బా! అంతే అగ్నిహోత్రం అంటుకుంది నాకు, దావాగ్ని దహించి వేయడం మొదలు పెట్టింది నన్ను. అర్థమవుతుందా నీకు నా బాధ? ఇదా నాకు ప్రతిఫలము!

స్త్రీకి సహనము అంటారు దేనికీ సహనము!

నన్ను ఇంటికి తీసుకువచ్చారు. ఆయన ముఖం సంతోషముతో కళ కళ లాడుతూ ఉంది. నాలో మాత్రం చీకటిఅగ్ని కూడాను. యంత్రపుబొమ్మ లాగ ఇంట్లో నిలిచాను. అక్క—డ ఆమె ఉంది, సుశీల ఇద్దరు పిల్లలతో. ఇంతలో ఆయన వచ్చారు. పిల్లలు నాన్నా అని ఆయన దగ్గరకి వచ్చారు. వాళ్ళని, ముద్దుచేస్తున్న ఆయన్ని చూశాను. ఇప్పుడు నిజం తెలిసింది. కొయ్యలాగా నిలబడిపోయాను. ఆమె టీ తెచ్చి ఇచ్చింది. ఇప్పుడు పూర్తిగా నిజం తెలిసిపోయింది. కూలపడిపోయాను.

ఆ నిమిషాన్నించీ నాలో అమృతం అంతా విషం అయిపోయింది. అనురాగమంతా అగ్నిహోత్రం అయిపోయింది. నా పిల్లని పోగొట్టుకున్నాను. ఆయన్ని పోగొట్టుకున్నాను. నే నెవరి కోసం ఉండడము!

ఎక్క—డ ఉండడము? ఆమె పిల్లవాడిని దగ్గరకి తీసుకుని నా మంట అణుచుకోవాలని అనుకునేదాన్ని ఎప్పుడైనా. దగ్గరకు తీసుకోగానే ప్రాణంతీసే కోరికతో నాచేతులు అప్రయత్నంగా మెడమీదికి వెళ్లేవి.

ఇంక నాట్యానికి నేను పనికిరాను అని కాబోలు ఆయన భార్యకే నేర్పడము మొదలుపెట్టారు.

కన్నుమూస్తే నా చిన్నిపాప నన్ను పిలిచినట్లయ్యేది. కళ్ళుతెరిస్తే ఎదురుగా ఆయనా, భార్య, పిల్లలూ.

ఒకసారి ఆ పిల్లవాడి మెడ పట్టుకున్నాను. ఇరుగు పొరుగూ ఏకమై నన్ను పట్టుకున్నారు. నా స్వాధీనంలో నేను లేకుండాపోయాను.

కళ్ళుతెరిచి చూతునుకదా గదిలో కాళ్ళు చేతులు కట్టి కటికనేలన పడిఉన్నాను. అవతల గుంపు

గుంపులుగా జనం సందడి. కొందరు తొంగి చూస్తున్నారు. ఇదివరకు నీచురాలినే. ఇప్పుడు రాక్షసిని కూడా అయ్యాను.

నా స్వామి మీద అనురాగం అంతా అగ్నిలాగా రగుల్కొని నాలో నవనాడులూ యీనాడు ప్రతిక్రియ!

మర్నాటినించీ ఇంట్లో ఏవ్వరూ నన్ను పలకరించరు. ఆయన నన్ను తప్పుకుని పోయేవారు. ఆవిడ పిల్లల్ని దాచేది. ఇంట్లో ఉండ లేక వీధులు తిరిగే దాన్ని. పిల్లలు నా వెంట పడి రాళ్ళు రువ్వేవారు. అందరికీ అసహ్యము.

వీధులు తిరగడము, ఇల్లు చేరడము నాదిన చర్య అయిపోయింది.

ప్రదర్శనాలలో నా అలంకార వస్తువులన్నీ మంటలో వేశాను. ఇట్టె నుసి అయిపోయాయి. ఇంత దావాగ్ని లోపల రేగిపోతూన్నా నేను మాత్రం నుసి కాలేదు. నీకీ వుత్తరం చదివి విసుగు పుట్టి ఉంటుంది. కోపం, అసహ్యం, నామీద తప్పకండా కలిగి ఉంటాయి.

నువ్వు కూడా నా కర్మ అంటావులే, అనుభవించమంటావు కాదూ!

పోనీలే నువ్వే చెప్పు. ఇలాగ ఈ లోకంలో ఎందుకుండగలను!

నేను వెళ్లిపోతున్నాను. నా పాప నన్ను పిలుస్తోంది. నా తల్లిని నా ఒళ్లోకి చేర్చుకోవాలి. నేను పాలివ్వాలి.

అదిగో పిలుస్తోంది. నేను వెళుతున్నాను.

నా పాపకి నామీద కోపం లేదు.

అదిగో నవ్వుతూ నన్ను పిలుస్తూంది!

నే వెడుతూన్నాను...

# వనంలో

పైడిపాటి సుబ్బరామశాస్త్రి.

ఎవ్వడే ఓయమ్మ
ఎవ్వడే యితడూ
కాలు నిలువక వనము
గాలించు చున్నాడు.

చిరునవ్వు నవ్వినది
చిన్ని చేమంతీ
ఏటికే యితనితో
యీపెకీ గుసగుసలు—

కదలినాదే మరల
వదలి నాదే దాని—
పదము పాడుచు నేమొ
పగలబడి నవ్వేను—
ఎవ్వడే....

నందివర్ధన మోవి
నందించె నిదియేమొ
గంటువడె చూచితివ
కంది పోయినది—
కదలినాదే—

రామః అదియేమె గు
లాబి చెక్కిళ్ళు
పెంట

చెళ్ల మనిపించు పో
కిళ్ల తగునటవె—
కదలినాదే—

కంపించి పోయినది
కెంపు గన్నేరూ
కాదనదు పొమ్మనదు
కను లప్పగించినది—
కదలినాదే—

సన్నజాజికి యింత
చనువు తగునటవె
చేరెదేసీ కనుల
చేసికొని పిలచేను—
కదలినాదే—

పారిజాతముఁజేరి
చీర సవరించేను
కిమ్మనదు యేమందు
నమ్మ—అవ్వవ్వః—
కదలినాదే—

కదలదును మెదలదును
యెద నప్పగించినది

మెట్టతామర కంత
దిట్టతన మటవె—
    కదలినాదే—

కనుపింప దేమి శశి
కాంతః అల్లదిగో—
మాటయ్యే నిప్పుడీ
మత్త మధుపాయి—
    కదలినాదే—

ఒకరుకా రిందరును
ఊరకుండేరు
ఒడలు తెలియని యట్టు
ఉబ్బిపోయేరు;

"అతడె కావలె" నన్న
యటుల చూచేరు
అతడేగు చుండంగ
అటమటించేరు.

ఎవ్వడే ఓయమ్మ
ఎవ్వడే యితడూ
కాలు నిలువక వనము
గాలించు చున్నాడు.
    ఎవ్వడేః

# నా అభిమాన కవి

శ్రీ ప్రతిభా సంపాదకుల సన్నిధికి:—

నమస్కారోభయ కుశలోపరి.

ఆ మధ్య మన — శాస్త్రికూడా 'నా అభిమాన రచయిత' అనే శీర్షికతో ఏవో నాలుగు ముక్కలు వ్రాసి—పత్రికకు పంప వలసిం దని అడిగాడు. ఆ పత్రికలో అతనూ కొత్తగా ప్రవేశించడం వల్ల తన ప్రయోజ కత్వం కొంత బయటికి వస్తుందనే వూహ తో యిలా పదిమంది మిత్రులనూ అడిగే వుంటాడు. అడగడమే గాని ఎవరు వ్రాస్తారు? అడిగేవా ళ్ళెక్కువ, వ్రాసే వాళ్ళు తక్కువ. ఉన్న పత్రిక లన్నీ లెక్క చూస్తే వ్రాయసగాళ్లకు తలకొకటి చొప్పున పంచిన మీదట శేషమందున పత్రికలే మిగులతవేమో కూడా.

పత్రికా సంపాదకులు పడుతున్న యీ ఇర కటం గమనించే, పోనీ, మనవాడు గదా, ఏవో నాలుగుముక్కలు వ్రాసి పంపుదా మనే చూచాను. కాని, తీరా ఆలోచిస్తే 'నా అభిమాన రచయిత' అనే పేరుతో వ్రాయడ మనేది వల్లమాలినపనిగా కనిపిం చింది. ఎందువల్ల నంటారేమో, మనవి చేస్తాను.

మొదలు, 'రచయిత' అనేటప్పటికి, పోనీ, భాషావిషయమే అనండి; 'దేనిని రచించే వాడూ' అన్న ప్రశ్న బయలుదేరుతుంది. పద్యాలు, పాటలు, కథలు, కావ్యాలు, కల్యాణాలు, నవలలు, నాటకాలు, నాటి కలు, కథానికలు, బృహత్కథలు, చిన్న కథలు, వచననాటకాలు, పద్యనాటకాలు, ఇంకా దేవుడు చాల మేలుచేస్తే వచన పద్యాలు, పద్యపు వచనాలు, వచనపు దరువులు, ఇంకా ఏమేమిటో—అన్నట్లు పారడీలు, చుక్కల పద్యాలు, తోక పద్యాలు,—ఇలా అనేకంగా రోజు రోజుకు కావ్యభేదాలు పుట్టుకు వస్తున్నవిగదా, వీనిలో ఏ రచనను స్వీకరించను, దేనిని మానను? పోనీ, వీనిలో ఏ వొక్కజాతి రచనలైనా నేను పూర్తిగా చదివితిని గను కనా? చదివినంత వఱకైనా నా కర్థమైనవి గనుకనా? అలాంటప్పుడు 'ఇదిగో ఫలాని రచయిత అంటే నా కభిమాన' మని వ్రాయడం శక్యమైన పనియేనా?

అదిన్నిగాక ఇందులో ఇంకొక చిక్కుగూడ వున్నది. వెనుక ఒకసారి కృష్ణాపత్రికలో నేటి కవులజాబితా ఒకటి ప్రచురించాము. ఆ జాబితాలో తమ పేర్లు చేర్చలేదనీ, చేర్చినా ముందుగా చేర్చలేదనీ ఎందరికో కోపాలువచ్చి, ముక్కు ముడుపులు, మూతి విరుపులతో సరిపోక, తుదకు రిజిష్టరు త్తరాల దాకా వచ్చి అందులోనుంచి బయటపడే టప్పటికి తల ప్రాణం తోకకు వచ్చింది. ఈ అవస్థంతా మన—శాస్త్రి ఎరగనిదికాదు. నిన్నగాక మొన్న ఒక పెద్దమనిషి

కొంచెమో గొప్పో కవియేగాని సామాన్యుడు కాదు, నేనా సంగతి ఎరుగుదును కూడాను. ఎరిగి ఏమి ప్రయోజనం! ఆయనపట్ల తీరనిఅపచారం చేసినతరువాత?- ఆయన్ని ఏదో ప్రసంగంలో, "ఏవైనా రెండు పద్యాలు చదవండి" అని అడిగాను. ఆయ నంతట "మాపద్యాలకేమి లెండి, లెక్కలోవా, జమలోవా?" అన్నాడు. అని అంతట వూరకోక "మీకృష్ణా పత్రికవారు మమ్మల్లను కవులక్రింద ఎంచరుగదా" అన్నాడు. అనేటప్పటికి, మర్మప్రహారకమైన ఆ మాటతో నాప్రాణాలు లేచిపోయినవి. ఔరా! ఎంత పొరపాటు జరిగింది! ఆ బ్రాహ్మడి మన సెంతనొచ్చుకుందోగదా! అని లోలోపల వగచి కుక్కిన పేనల్లే ఊరుకొన్నాను. ఇటువంటి అపచారం ఇంకా ఎంతమందికి జరిగిందో, ఆ పరమాత్ముడికే తెలియాలి.

కాగా, కవుల జాబితాలో ముష్టిపేరులు ప్రకటించడమే ఇంత మనస్తాపానికి కారణమయిందే, ఇక 'నా అభిమాన రచయిత' అంటూ ఏదో వెఱ్ఱిమొఱ్ఱి వ్రాత ప్రారంభిస్తే బజావు దక్కుతుందా అని భయపడి వూరకొన్నాను.—శాస్త్రికి కోపం కూడా వచ్చి వుంటుంది. నేను వ్రాసి పంపానుగానని. ఏమి చెయ్యను? ఈ స్థితిలో మళ్లా మీరూ అదే విషయం వరించి వ్రాయవలసిం దని ఆజ్ఞ యిచ్చారు. అయితే, మీ పుణ్యమా అని 'నా అభిమాన కవి'ని గురించి వ్రాయమన్నారు గనుక ఇది కొంత నయం. ఏమిటో, వల్లకాటినయం! ఇందులో మాత్రం చిక్కులు లేవూ! అందులోనూ కవులతో గురించిన పనిగాని మరొకటి కాదాయె.

చిక్కు లేమిటంటారా? చెపుతాను వినండి. 'నా అభిమానకవి' అనగానే నేటి కవి అనేగద మీ అభిప్రాయం? నేటి కవులు అనేటప్పటికి ముందుగా మాగురు పాదులు శ్రీ తిరుపతి వేంకటకవులమాట చెప్పవలసి వస్తుంది. వారిని నా అభిమాన కవులుగా పేర్కొనేటప్పటికి మనవాళ్ళంతా 'ఇంకా ఈతడు ముసలి కవులను చూచుకొనే మురుస్తున్నాడు. ఆనకట్టకు పూర్వపు మనిషివలె వున్నా'డని చప్పున ఈసడించివేస్తారు. అందువల్ల వారిని వదలుకోవలసి వస్తుంది. వారినే వదలుకొన్న తరువాత ఆతరం వారిలో ఇంకొకరి ప్రసక్తి ఎత్తనే అక్కరలేదు.

'పోనీ మనతరం వాళ్ళలోకెల్లా ప్రాథమికులు రాయప్రోలు సుబ్బారావుగారున్నారుగదా, వారినెందుకు పేర్కొగూడదూ?' అని ఆలోచించాను. నిజమే సుబ్బారావుగారి కవిత్వమంటే నాకెంతైనా అభిమానముంది. అభిమానమేకాదు గురుభావంకూడా వుంది. ఉండి ఏమిభాగ్యం! ఆయన కవిత్వానికీ మధ్యనే మనమంతా కలసి పాతికేళ్ళ పండగచేసి, అఱ్ఱుగడిగి వదలిపెట్టడం

వల్ల, మళ్లా ఆయన్ని బజారు కెక్కించడం బాగుండ దని నాకు తోచింది.

పోతేఇక సభాపతిశాస్త్రిగా రొకరున్నారు. మనతరం కవు లందరిలోకీ వారు విద్యా వయోవృద్ధులు—వయోవృద్ధులూ అంటే, వా రిటీవల కట్టించు కొన్నా రని చెప్పబడే గాజు పళ్ళను అలంకరించుకోగా ఎప్పుడూ చూచే భాగ్యం కలగక పోవడంవల్ల అనవలసివచ్చిందేగాని శాస్త్రిగారిపట్ల గౌరవం లేకకాదు-ఇంకా ఏవో పాటల నాటకాలూ, పద్యనాటకాలూ వాకోవాక్యాలూఅంటూ సరికొత్త మార్గాలు వెదుకుతూ ముందంజ వేస్తూనే వున్నారు గాని వెనక్కు తగ్గుతున్న జాడ కనిపించదు. శాస్త్రిగారు వస్తేనేగాని పెణ్ణం బిగించడానికి వీలులేని స్థితిలో కాలక్షేపం చేస్తూ, రసిక గోష్ఠులలో అగ్రపీఠం అలంకరిస్తున్నారు. అదిన్నీ గాక ఆమధ్య మా గ్రంథాన్ని గూర్చి కొంచెం మెచ్చుకొంటూ పత్రికలలో ప్రకటించారు కూడాను. అందుకని వారిని నా అభిమానకవిగా వ్రాసి పారేస్తే కొంత బదులు తీర్చు కొన్నట్లుగూడ అవుతుం దని ఆలోచించాను. కాని శాస్త్రిగారు ఇటువంటి సర్టిఫికెట్లు అనేకమందికి అడగని వాడిది పాపంగా వ్రాసిపారేస్తున్నట్లు విన్నాను. ఆరీతిగా ఆయన కెందరో ఋణపడి వుంటారుగనుక, వారిని తమ అభిమానకవిగా చెప్పేవారు చాలామంది వుంటారుగదా, మనమే పనిపెట్టుకొని చెప్పనక్కరలేదు అనిపించింది. పోగా, ఆ కారులో దువ్వూరి కవిగా రొకరు,అబ్బూరి కవిగా రొకరూ వున్నారు. రెడ్డిగారి కవిత్వమంటే నా కెంతో అంత అభిమానమైతే ఉన్నది గాని ఆయన మన సాహిత్య పరిషత్తుకు వెలివెలిగా తిరుగుతూ దాని సంపర్కం ఏమాత్రం తగిలినా మైలబడి పోతానేమో అని తప్పించు కొంటున్నట్లు తోస్తుంది. అటువంటివాడికి నే నిప్పు డగ్రతాంబూల మిచ్చానా అంటె మనవాళ్ళందరికీ ఎంతైనా కష్టంగా ఉంటుంది. గనుక ఆయన్ని కేటాయింపుగా వుంచడమే నీతి అని ఎంచాను. ఇక అబ్బూరికవిగారంటారా ఆయన కవిత్వం ఎవరికైనా అభిమానపాత్రమేకావడానికి ఆక్షేపణయితే వుండదుగాని ఆయనకే తన తొలికవిత్వం మీద అభిమానం లేదనీ, ఇప్పు డేవో కొత్త కవితా మార్గాలు అన్వేషిస్తున్నా డనీ వింటాను. అందువల్ల మనం గనక ఇప్పు డాయన విడిచిపెట్టిన కొమ్మను పట్టుకు వ్రేలాడామూ అంటే చప్పున ఎగతాళికి ప్రారంభిస్తాడు. "చూచారా! వీ ళ్ళెంత అధోగతిలో వున్నారో! ఇప్పటికీ ఇంకా మన కవిత్వాన్ని మెచ్చుకొనే వీళ్ళకు పాపం! తరుణోపాయ మెప్పటికో" అంటూ, అందులోనూ ఆయన మహా కొంటెమనిషి. అపహాస్యానికి కొంచెం సందు దొరకడమే ఆయనకల్లా కావలసింది. అంతేగాని అది తనకు దగిలేదీ, ఎదటివాళ్ళకు దగిలేదీ

కూడా ఆలోచించడు. కాబట్టి మన ఘాయన జోలికి పోగూడదు.

వీరిని వదిలిపెట్టితే ఇక గోదావరీ శాస్త్రిద్వయ మొకటి వుంది. కృష్ణపక్ష శాస్త్రి గారూ, దీపావళి శాస్త్రిగారూను ఏదో, సౌలభ్యం కొఱకు అలా పేర్లు పెట్టానే గాని నిజానికి కృష్ణశాస్త్రిగారిలో కృష్ణ పక్షమూ లేదు, సత్యనారాయణశాస్త్రి గారిలో దీపావళీ లేదుసుమండీ ! వీరుభయులూకూడా చాలా ప్రగల్భులైన కవులు. అందులోనూ దేవులపల్లి వారు నేటికవులలో చాలా మందికి వరవడి పెట్టారు. ఆయన నిత్యయౌవనులు.

కృష్ణశాస్త్రి లేని కవితా గోష్ఠి ఊర్వశి లేని దేవర్షి గోష్ఠిగా వుంటుంది. ఇంతటివాడు వుండగానే ‹గౌతమీ కోకిల' మనే బిరుదు తనయందు సార్థకం చేసుకొన్న వేదుల కవి గడుసుదనాని కేమంటారు! ఎంత విచారించినా, వీరి వుభయులలో ఎవరిని వరించడమో నాకేమీ పాలుపోయిందిగాదు. రసిక హృదయాలను నిస్సపత్నంగా ఏలుకుంటూ వున్న యీ యిద్దరిలో ఒకరిని వరిస్తే రెండోవారికి అపచారం చేసినట్లవుతుం దనిపించింది నాకు. అటువంటి అరమరలు వారిలో వారికి లేకపోయినా, మధ్య మనం వచ్చి మెరమెరలు పుట్టించినట్లవుతుందేమో నని, ఉన్న మాట చెప్పొద్దూ! నేనే సంశయించాను. 'ఇంతదూరం ఘాళ్ఘా వీరా అని వెతక్క పోతే విశ్వనాథ సత్యనారాయణ వున్నాడుగదా మీ యూరివాడు' అనబోతారు మీరు. మీరేగాదు ఎవరైనా అనదగిన మాటే యిది. సత్యనారాయణ నేటి కవులలో మహోన్నతు డనిపించుకొంటున్న మాట నిజమే. అత నవలంబించే కవితా రీతులుచూచినా, సాహిత్యవీధులలో అతను చేసే నిరర్గళ విహారం చూచినా ఆశ్చర్యం కలిగేమాట నిజమే. ఇందు కెవరూ కాదనరుగాని వచ్చిన చిక్కేమి టంటే అతను మా బందరువాడై పోయినాడు. దురదృష్టవశాత్తూ సర్కారులవాళ్ళకు తక్కిన తెలుగువాళ్లంటే తిరస్కారభావ మనీ, గుంటూరు వాళ్ళకు బంద రంటే పడదనీ, రాజమండ్రికి ఎవ్వరూ గిట్టరనీ,-ఇటువంటి అపకీర్తి వొకటి వుంది మనకు మొదటనుంచీ. ముఖ్యంగా బందరువాళ్ళు,కావడానికి వట్టి సిప్రపుయోజకులైనా సర్వజ్ఞత్వం నటిస్తూ వుంటా రని తక్కిన తెలుగువాళ్ళంతా కంటగించుకొంటూ వుంటారని అందురూ ఎరిగిన సంగతే. పూర్వం మనవాళ్ళు ‹పొరుగింటి పుల్లగూర రుచి' యనీ ‹పెరటిచెట్టు మందుకురా' దనీ అనుకొనే మాట లన్నీ నేటికాలానికి విపరీతమై వూరుకొన్న కారణం చేత మా సత్యనారాయణను అగ్రపీఠ మెక్కించడానికి నేను ఎంతైనా భయపడవలసి వస్తున్నది. ప్రసక్తి వచ్చింది గనుక నామన్సులో మాట మరొకటి కూడా చెప్పేస్తాను·ఇంకా దాపరిక మెందుకు! పొరుగూళ్ళలో చెలా

మణిలేక పోయినా, ఏదో వున్న వూరు కావడంచేత బందరులో మాత్రం నేనూ ఒక కవి నంటూ కాస్త గౌరవంగా కాలక్షేపం చేస్తున్నాను. కనుక అనన్యగతికుడైన నావంటివా డిప్పుడు, చేటూపాటూ ఎరగ నమ్మ మగడి పెళ్ళికి వెళ్లినట్లు తీరికూర్చుండి, ఇంకో బందరు కవికి చేతులారా పట్టం గట్టాడూ అంటే, లేనిది లేకపోగా బందరులో వుండే ఆ కొంచెం గౌరవంకూడా సున్న చుట్టుతుంది. కాబట్టి యీ ఆత్మహానన పాతకానికి మనస్సు వొడబడటం లేదు. చూస్తున్నారా, ఎన్ని చిక్కులున్నవో యిందులో! ఇంకా మనవి చేస్తున్నాను.

మన సీతారామమూర్తిచౌదరిగా రున్నారాండి. పరిశుద్ధమైన కవితాధారా, అంతకంటె పరిశుద్ధమైన అంతఃకరణాగల సజ్జనుడూ గదాండి!

ఆయన కవిత్వాన్ని గనుక నా కభిమాన స్థానముగా వ్రాసానూ అంటే చూపోపని మన బాపన కవు లంతా వెంటనే ఏమంటారో ఎరుగుదురా. "కమ్మవా రందరికి అభిమాన పాత్రుడు కావడానికి ఇదేదో 'ఎలక్షను స్టంటు' వేస్తున్నాడు" అనేస్తారు. మూడుమూర్తులా పూర్వకవి మార్గాలను పుణికిపుచ్చుకొన్న చౌదరిగారి ప్రౌఢకవితారీతికి యిట్లా కొడిమలు గట్టించడం కూడదని తోచింది. మళ్ళీ అంతలోనే, 'యీ బ్రాహ్మణ కవులకు మాత్రం పరస్పరం అంతశ్శీతాలు లేవు గనుకనా, వీళ్ళమాట యెవడు లెక్కచేస్తాడు' అని సమాధాన పరచుకొని జూచాను. కాని వెంటనే జోషువా కవి కళ్ళకు గట్టినట్లుగా ఎదుట నిలిచినట్లై మనసు వెనుకాడింది. వెనుకాడి, మెఱపు మెఱసినట్లుగా ఇంకొక దివ్యమైన వూహ తట్టింది. వారేమిటి, వీరేమిటి, జోషువా కవికే అగ్రపీఠంఅర్పిస్తేసరిపోతుంది. ఆయనా రసవత్కవితకు పేరుపడినవాడు. రాజాధిరాజుల సభామంటపాలలో అగ్రతాంబూల మందు కొంటూన్న వాడూ గాని సామాన్యుడు కాడుగదా! పైగా ఆయనను గనుక మెచ్చుకుంటే బ్రాహ్మలు కాదు, కమ్మవారుకాదు, క్షత్రియులుకాదు, కాపులు కాదు, మరియెవ్వరూ నోరెత్తడానికి వీలుండదు. అప్పటికీ ఎవరైనా మెదిలితే గాంధిగారికి వ్రాసిపారేస్తేసరి. వారే తగిన సమాధానం చెపుతారు అనుకొన్నాను. అనుకొన్నానేకాని మళ్లాపర్యాలోచనచేసిచూస్తే, కవిత్వ మల్లడమంటే 'ఇదేమి ఏకులు వడకడమాఏమిటి! సాహిత్య విషయంలోకూడా అధ్వర్యం గాంధిగారికి కట్టిపెట్టడం కంటె కవులకు తలవంపులు వేరే వుంటుందా' అని కవిలోకమంతా దుయ్యబట్టుకొంటుందేమో అనే భీతి ఆవహించింది.

పోనీ, పండితవంశంలో పుట్టి, నవ్యసాహిత్యపారిషదుల్లో ఈపాటి కర్మిష్ఠి లేడనీ, లాయర్లలో ఇంతటి నిష్కపటి లేడనీ పేరు పొందిన నోరిగదా, నవ్యసాహిత్యం తరఫున

వశాల్తా పుచ్చుకొని తంటాలు పడుతున్న కవిగా రొక రున్నారు. ఈయన కవిత్వాన్ని నాకభిమానస్థానంగా పేర్కొందామా అని ఆలోచించాను. కాని మూడు రైళ్లు దాటి వెళ్లితేగాని అందుబాటుకాని మారుమూల వున్న ఆ బ్రాహ్మణ్ణి రచ్చకీడ్వడమే తప్ప ఆయన మనం మెచ్చుకొన్నాం గదా అని సంతోషించకపోగా, నే నేదో ప్రతిఫలంగోరి ఆ పని చేసివుంటానని అనుమానిస్తాడు కూడాను. అనుమానిస్తే మానె; మనసులో పెట్టుకు వూరుకోక, ఆమాట కాస్తా, కలకలా నవ్వుతూనే, మొగంమీద అనేస్తాడు. పది మందిలో వుండగా చూచి అన్నా అన్న వాడే. ఈలా మెచ్చుకొన్నా కూడా తంటాయే అయితే వీరితో వేగడ మెలాగో చెప్పండి! మా బాపి బావ మాత్రం మెచ్చుకొంటే, పొంగిపోయి వెన్నవలె కరుగుతాడు. మన సెంత మెత్తనో మనిషికూడా అంత మెత్తన. ఈ యేడు నవ్యసాహిత్య పరిషత్తులో ఆయన కెలాగూ పెద్ద పీట వేస్తున్నారు. కాబట్టి నేనుకూడా వరణమాల్యం ఆయన మెడలోనే వేసి, బుగ్గలకింత గంధంపూస్తే సరిపోతుం దనుకొన్నాను. కాని ఇంతలోనే ఒక మాట అడ్డొచ్చింది. వెనక ఒకాయ నెవరో, —ఒకాయనో ఒకాఁడో తిన్నగా జ్ఞాపకం లేదుగాని — అన్నారు కదా, "బాపిరాజు కాసేపు దీంట్లోనూ, కాసేపు దాంట్లోనూ కాలు పెడతాడు. కాలు గాదు, వేలే పెడతాడు" అన్నారు. నిజమే. పాటకూ తానే పద్యానికీ తానే, నవలకూ తానే నాటకానికీ తానే, కథకూ తానే, కల్యాణానికీ తానే, ఆటకూ, అభినయానికీ, అందానికీగూడా తానే, — ఇంకా దేవుడు చాలా మేలుచేస్తే — చిత్రకళకూ తానే, సినీమాకు తానే, ఇలా దేనికి పట్టితే దానికి తానా అంటే తందానా అంటూ తయారై దేనియందూ మనసు నిలపలేని మనిషిని ఎలా నమ్ముకోవడం చెప్పండి! అదిన్నీగాక నేను గనుక ఇప్పు డాయన కవిత్వానికి పట్టం గట్టితినా, అందరికీ తలలో నాలికగా మెలగుతూ జనముద్దైన మనిషి కావడంచేత వెంటనే ఇంకొకరు నవలకు గూడా ఆయననే పట్టం గట్టుతారు. ఇంకొకరు కథలకు, మరొకరు చిత్రకలకు, ఆటకొకరూ, పాటకొకరూ ఇలా అన్నిటికీ ఆయన్నే వరించి తలో పూలమాలికా పుచ్చుకు సిద్ధమయ్యే టప్పటికి, దేశంలో ఇక ఎవ్వడికీ, ఏవిషయంలోనూ ఆస్కారం లేకుండా పోతుంది. పోతే పోయింది. నిక్షేపం వంటి బాపిబావ, యీవరణ మాల్యాలన్నీచూచి, మొదలే విశ్వాన్ని మఱచి వుండే మనిషి— తన్ను తానే మఱచిపోతాడేమో అని భయపడి వూరుకున్నాను.

పోతే మంచితనంలోనేగాక మైమఱపులో కూడా బాపి బావను మరపించేవాడు మాధవపెద్ది కవీశ్వరు డొక డున్నాడు.

ఈయన కవిత్వమంటే నాకెంతో అభిమానం; అభిమానమే కాదు; శక్తిలేదు గాని కనకాభిషేకం చేద్దామన్నంత కుతూహలముంది. కాని ఏమి ప్రయోజనం! "ఎగద్రోయ దిగజారునెద్ది మాధవపెద్ది" అని ఆయనే చెప్పుకొన్నాడు. తీరా మనం తలో చెయ్యీ వేసి సింహాసనం మీద కూర్చోబెడితే అందులో కుదురుగా కూర్చోలేడు. పప్పుజారినట్లుజారి, పొడుముక్కుతానూ సిద్ధమై మళ్లా "కవచకుండలముల గగ్గయ్య పుట్టెనే" అంటూ మొదలెత్తుకొంటాడేమో అని భయం. అయితే యీ మధ్య శ్రీ వేంకటశాస్త్రులవారు "స్వయంవ్యక్తుడు" అంటూ పేరుపెట్టినప్పటినుంచీ కొంచెం గడుసుబారి, తెనాలి క్లబ్బులోనూ, కాఫీ హోటళ్ళలోనూ కొంచెం రొమ్ము విరుచుకొని తిరుగుతున్నాడనీ ఎవరైనా "ఏమండీ శాస్త్రుల్గారూ!" అని పలకరించి ఏదైనా పద్యం చదవమంటే ఒక పట్టున చదవక "వెనకటి వెంకటప్పాచార్ల్లా, వెనకటి కథా అనుకొంటున్నావేమో, ఇప్పుడు వీడు స్వయంవ్యక్తు" డని దబాయిస్తున్నాడనీ వింటున్నాను. ఏమైనా, దీని నిజానిజాలు తెలిసే పర్యంతం ఆయనికి పెద్ద పీట వేయడానికి వల్లగాదు.

వీరందరూ ఆలావుండగా నాకు పరమ మిత్రుడూ, నేటి కవులలో మణిపూస వంటివాడూ, నవనీత హృదయుడూ అయిన నాయని సుబ్బారావైతే వున్నాడు గాని, ఆతనికిప్పుడు నేను ప్రథమ తాంబూలం ఇవ్వలేదని మనసులో ఏమీ అనుకోడు గదా అనే ధైర్యంచేత ఆతన్ని వదలి, ఇంకా నాకు మొగమోటమి కలవారూ, 'సమయం వచ్చినప్పుడు మన మాట ఎత్తలేదు చూచావా' అనుకొనేవారూ ఎవరైనా వున్నారేమో అని పారజూచాను. ఇంకా ప్రసిద్ధులైన కవులెందరో వుండి వుంటారు. మతి మఱపువాణ్ణి; సమయానికి జ్ఞాపకం వుండదు.

పోనీ, అనంతకృష్ణ శర్మగారున్నారు. వేలూరి శివరామశాస్త్రిగారూ, చంద్రశేఖరంగారూ వున్నారు. నండూరి సుబ్బారావుగారూ, దీక్షితులుగారూ వున్నారుగదా! వీరిలో ఎవరైనా మన అభిమాన కవిగా పేర్కొవడానికి పనికి వస్తారేమో పరామర్శించి చూతునా అని ఆలోచించాను. కాని వారందరూ పెద్దలు, పూజ్యులూ కావడంచేత వారిని గూర్చి ఏదో వ్రాయడం ఆరంభిస్తే 'ఎటూడ బోగా నెటువచ్చునో, తడవగా వెఱతుఱ కరముల్ మొగిడ్చెదఱ' అనేమాట జ్ఞాపకం వచ్చింది.

ఈలా నేనెరిగినంతలో, నాకు జ్ఞాపకమున్నంతలో ఎవరినిగూర్చి ఆలోచించినా ఎక్కడి కక్కడికి చిక్కులే కన్పిస్తున్నవి. వీరిలో ఎవరికివారు ప్రథమ గణ్యత కర్హులైనవారే కావడానికి. అందరూ నా అభిమానానికి పాత్రులైనవారే. అందరూ గుమ్మడికాయంత ముత్యాలేగాని తక్కువ

వారెవ్వరూ లేరు. అయినా మనస్సును సమాధాన పరచుకోవడానికి ఎన్నెన్ని ఆటంకాలు ప్రబలతరమైన వున్నాయో మీకూ కన్పిస్తూనే వున్నవిగదా!

అయితే యీలా నలుగురి నోళ్ళలోనూ పడి, వీధికెక్కినవారు కాకుండా ఇంకా సముద్రగర్భంలో వున్న జాతిముత్యాల వంటివారు కొందరుండి వుంటారు. వారి నిప్పుడు మనం ప్రయాసపడి వెలికి తీసి రచ్చకెక్కించడమేగాని ఆ యజ్ఞాత కవికీర్తనాని కెవరు హర్షిస్తారు?

ఒకరు హర్షించడం మాట అలా వుండగా, వీరిలో చాలా మంది ఇంకా ఉ, చం, మ, శా, అంటూ పద్యాల పేర్లతో సహా అచ్చువేసే పూర్వకాలపువాళ్ళు. తాము వ్రాసేది ఏమి వృత్తమో, అసలు పద్యమవునో, కాదో అనే ఆలోచనే మరచిపోయే తన్మయత్వం వారికి సిద్ధించినట్లు తోచదు. అటువంటి అమాయిక కవుల గొడవ ఎవరికి కావాలి?

ప్రతిభ పుట్టింది మొదలు ఎన్నడూ ఏమీ వ్రాయలేదుగదా- శాస్త్రి చెప్పినట్లు నాపేరప్పుడప్పుడు ప్రతిభ అట్టమీద కన్పించడమేకాని లోపల పడిందిలేదు గదా, పైగా మీరింతగా అడిగారుగదా, పోనీ, యేదో వ్రాసి పంపుదామంటే యీ విషయ మిలా యక్షప్రశ్నవలె గొంతు పట్టుకొంటున్నది.

మనకారు కవీశ్వరుల పట్లనే యేమో యీ ఆటంకము లన్నీ; ఇంకా కొత్త కవులున్నారుగదా, హనుమదింద్రకంటి పిలకా గణపత్యాదులు; మరీ కోడెకారు కవులున్నారు గదా శ్రీ శ్రీ రుక్మిణీనాథాదులు వీరిలో ఎవరినైనా వరిస్తే యీ చిక్కులుండవేమో అని చూచాను. కాని వీరితోనూ, వీరి గ్రంథాలతోనూ నాకు బొత్తిగా పరిచయం లేదు. ఉన్నంతలోనైనా, అర్థజ్ఞానం అసలే అంతంత మాత్రం కావడంచేత, వారిని గురించి ఏమి వ్రాయడానికీ ధైర్యం చాలదు. అందులోనూ, మళ్ళా వీరిలో కొందరు మనకారు కవీశ్వరుల మార్గాలే ఇంచు మించుగా అనుసరిస్తున్నట్లు కన్పించుతుంది. అటువంటి వారిని పైకెత్తానూ అంటే, వారికి మన కవిత్వాల మీద ఉన్న ఆ మాత్రపు గౌరవం కూడా సడలిపోవడమే కాక మనవాళ్ళందరికీ మరీ కష్టంగా వుంటుంది. కాబట్టి వారిలో మనకు శిష్యప్రాయులైన వారిని వదలిపెట్టుదాము. శిష్యులను మెచ్చుకొనడం కూడా దోష మంటారు మన పెద్దలు. అందుకనేగా పాతకారుకవులు మన కవిత్వాలకు పెదవి విరుస్తూ వుంటారు. అలా వారు పెదవి విరుస్తూ వుండడం అసూయచేత నని మన మనుకొనే వాళ్ళము. ఇప్పుడు మనం మెచ్చుకోవలసిన కవీశ్వరులు కూడా కొందరు బయలుదేరిన తరువాత మనకు తెలిసివస్తున్నది. చిన్న వాళ్ళను

స్తోత్రం చేయడం క్షేమం కాదని. కనుక వారిని విడిచి, స్వస్వభావ కవిత్వం ( Surealism ) వ్రాస్తున్న కోడెకారు కవుల సంగతి మాత్రమే ఆలోచించుదాము.

వీరెవ్వరూగూడా మన శిష్యపరంపరలో వారు గారు. మన కవిత్వాల మీద వీరికి గౌరవంకూడా లేదు. గౌరవం యిల్లు వల్ల కాడాయిరి. కాస్త మనపట్ల గోప్యం ఏమైనా వుంచుతున్నారేమో అంటే అదీ లేకపోగా పైపెచ్చు మనల నందరిని "లోక మడతకవు" (Escapisto) లంటూ యీ సడించడం ప్రారంభించారు కూడాను. ఈసడిస్తే వాళ్ళ పాపాన వాళ్లే పోతారు, మన పెద్దతనం మన మొందుకు దక్కించు కోగూడదు అని చూస్తే, వీళ్ళతో ఇంకొక చిక్కుగూడా వుంది. ఏమిటంటే, స్వస్వభావకవుల కవిత్వం మన కర్థమైనట్లు నటించి అందులో మనం గుణోద్ఘాటనం ప్రారంభిస్తే వాళ్ళు దానిని అవమానంగా ఎంచుకొంటారేగాని హర్షించరు. ఆలా ఎంచుకోవడం కూడా న్యాయంగానే తోస్తుంది నా బుద్ధికి. ఎందువల్లనంటే, మన పాతబుఱ్ఱలకు అర్థమయితే మరి కొత్తయేముంది, వాళ్ళ కవిత్వంలో! మన కవిత్వాలుగూడా, పాతవాళ్ళకు దుర్బోధం కావడం వల్లనేగా క్రొత్తదనం సంపాదించుకొన్నవి; అంతే కాదు: ఇందులో ఇంకొక ధర్మ సూక్ష్మం కూడా వున్నది. 'అర్థ మయినా, కాకపోయినా, మన కవిత్వాన్ని అభినందించారు గాని మరొకటి కాదుగదా, మన మొందుకు హర్షించకూడదు?' అని గనుక సమ్మతి చూపినట్లయితే ఇవ్వాళ్ళ గుణోద్ఘాటన చేసినవాళ్ళు రేపు దోషోద్ఘాటనం ప్రారంభించవచ్చు. గుణం చెప్పినప్పుడు హర్షించి దోషం చూపినప్పుడు హర్షించకపోవడం కంటె మొదలే 'వాళ్ళకు మా కవిత్వంలో రసారస విచారణచేసే యోగ్యత లేదు' అని చెప్పడమే క్షేమం. ఇంతకు నిజమాలోచిస్తే అందరికీ తెలిసిపోతే ఇంకా ఆ కవిత్వంలో కొత్తేముంది, వింతేముంది? కనుక ఈలావిచారించినకొద్దీ మనం అభినందించడానికి బ్రదికివున్న కవులలో ఎవ్వడూ పనికిరాడు అని తప్ప వేరే పర్యవసానం తేలేటట్లు లేదు. కాకపోతే ఈ నానా కవి సంకీర్తనం వల్ల నేను నవ్యసాహిత్య పరిషత్తుకు అధ్యక్షుణ్ణి కాలేదు అనే లోపం మట్టుకు తీరినట్లయింది. ఈ వ్రాసినంతలోనయినా, ఎవరికీ ఏమీ కోపతాపాలు రాకుండా వుంటే మీరూ నేనూ అదృష్టవంతులమే.

ఇంతవఱకు వ్రాసిన తరువాత దీనిని మా దర్బారులో అందరికీ వినిపించాను. అంతా విన్నమీదట. మా దర్బారీయులలో ఒక బుద్ధిశాలి అన్నాడు కదా, "ఇంత కంటె తెలివితక్కువ ఏమైన వున్నదా? నువ్వేమో మహానేర్పరి వని నిన్ను దర్బారు కవిని చేసినందుకు మా దర్బారంతటికీ తలవంపులు తెచ్చేటట్లున్నావే! ప్రతిభా సంపాదకు

లంతటివారు నీ అభిమానకవిని గూర్చి వ్రాయమని నిన్ను అడిగితే ఇంకా సందేహిస్తావెందుకు ? వెఱ్ఱివాడా ! వ్రాసి పారెయ్యవయ్యా ! వెంటనే 'నా కవిత్వం మీదనే నా కభిమాన' మని. ఇంతకంటె సందెప్పుడు దొరుకుతుంది" అన్నాడు. ఆ మాటకు నేను నిర్ఘాంతపోయి చూస్తూవుంటే దర్బారీయులందరూ "సెబా" సంటే "సెబా" సన్నారు. అసలు దర్బారు కవి ఇంకొక కవిని మెచ్చుకోవడానికే వల్లపడ దన్నారు. 'అలా మెచ్చుకుంటే దర్బారు పరువే పోతుం దన్నారు. నువ్వు మాత్ర మేమి? సామాన్యుడవా? 'ఎందుకలా సందేహిస్తా' వన్నారు. మన కవిత్వాల మీద మనకే అభిమానంలేకపోతే పరాయి వాళ్ళు అబిమానిస్తారు గనుకనా' అన్నారు. ఇలా తల కొక మాటా అంటూ దూయబట్టుకొని చివరకు 'నీ వలా వ్రాయకపోతే ఇక నీ మొగం చూడము. నీ 'దర్బారు సాయరు' బిరుదు తీసిపారేస్తా' మని తేల్చారు. ఇంకా నయం. 'మాలో ఎవ్వరూ పనికిరాకపోయినారా, నీకు ?' అని వెంటబడ్డారు కాదు, వాళ్ళ పుణ్యమా యని.

చూచారా! ఎటువంటి సంకటా వస్థలో పడ్డానో! దర్బారీయు లందరూ బుద్ధిశాలురు కదా, పోనీ, ఏదైనా సలహా చెప్పుతారేమో అనే ఆశకొద్దీ నేను వినిపిస్తే, కథయిలా అడ్డం తిరిగి పూరుకుంది. లోకంలో యెవరినైనా శరించ గలనుగాని యీ దర్బారుమూకను శరించడం నావల్ల కాదు. వాళ్ళమాట వినక పోతినా, 'యింటిలోది పోరు ఇంతింత గాదయా'అని నన్ను వీళ్ళిక తలయెత్తుకు తిరగ నివ్వరు. ఈ దర్బారు పోటు భరించడం నాతరం కాదు.

కనుక, ఈ యిబ్బంది అంతా మీరు విచారించి, నాకు ఏమి సలహాయిస్తారో యివ్వండి. ఆ ప్రికారం నడుచు కొంటాను.

... ... ...

(షరా) ఇంకొక్కటి మనలోమాట మనవి చేస్తున్నాను. మనసులో పెట్టుకోండి. 'నా అభిమానకవి' అనే శీర్షికతో ఏదైనా వ్రాసి పంపవలసి దని, నన్నడిగినట్లే మీరు పలువురినిఅడిగివుంటారుగనుక, వారిలోఎవరయినా, తమ అభిమాన కవిగా నన్ను పేర్కొంటే పేర్కొవచ్చును. మేలెంచి కీడెంచడం మంచిది. ఆలా నన్ను అభిమానించిన మహానుభావు లెవరైనా వుంటే, వెంటనే వారిపేరు, రెండో కంటివారెరగకుండా, నాకు తెలపండి. నేనుకూడా నిర్విచారంగా, పరమ సంతోషంతో వ్రాసి పంపుతాను. వారి కవిత్వమంటే నాకు పరమాభిమాన మని. నా అభిమానానికి కారణా లంటారూ ? కారణాలకేమి, కారణాలు తక్కువౌతవీ మనం పూనుకొంటే.

చిత్తగించవలెను,

దర్బారు సాయర్.

# ఉన్మత్తులు

వి. వి. శ్రీనివాసాచార్య.

అన్నానికి రావే అని
తన్నెంతగ పిలిచి పిలిచి తల్లి విసిగినా—
చిన్నది ఆటల సందున
అన్నము వూసే మరచిన దానందములో.

నాయనః ఎటనైనా పని
కై యత్న మొనర్పరాదః అని తండ్రంటే—
"ఛీః" యని విదిల్చి కొట్టెను
న్యూ యెక్స్పెరిమెంటొనర్చు యువకవి ఒకచోన్.

దినము దినమెల్ల చెమటోడ్చి తెచ్చుకున్న
బేడ డబ్బులు రొంటిన బెట్టి, దారి
తీయును — సినిమా హా లెక్కడోయి అనుచు—
కూటికై మొగము వాచిన కూలివాడు.

క్రొత్తగా కార్యమైన క్రొంగ్రొత్త భార్య,
ముసలి తల్లిదండ్రులు ఎంత మొత్తుకొనిన
గాని, ఉద్యోగమునకు రిజైను బెట్టి
తాను సత్యాగ్రహుల లిస్టు లోన జేరె.

దారి వెంట బోయెడు షాహుకారు బిడ్డ
నల్వురుని జూచి లోలోన నవ్వుకొనెను;
పిచ్చివా రని, బ్రదుకు తెర్వెరుగ లేని
బేల లని పాప మూరక జాలిపడెను.

# ఎవతవో!

మొక్కపాటి కృష్ణమూర్తి

మసక చీకటి
మాయ లోకం
కునుకు పోయే
గుడ్డి రాతిరి
ఏటి కద్దరి
ఏల పాటల
ఎవతవో
          బాలా!
నను గలత పెట్టే
వెవతవో
          బాలా!

కనులు చించిన
కానుపించవు
కదలి పోయో
కమ్రి గీతివా
వంతగా నా
గొంతు విచ్చెనె
ఎవతవో
          బాలా!
నను గలచి పొయ్యే
వెవతవో
          బాలా!
పున్నెముకు
పున్నాగ పూచెను
పూల తావుల
తేలిపోతూ
వెదకి కొందునె
విధుర గీతుల
ఎవతవో
          బాలా!
నను గలచి పోయా
వెవతవో
          బాలా!

## శ్రీ. శ్రీ.

# కవి ప్రశంస

పెనుమర్తి కామేశ్వరరావు.

తరంగం
కురంగం
ఫిరంగి, శ్రీ. శ్రీ.

చెప్పదల్చుకున్నదే చేస్తాడు
నీటుగా, సూటిగా, కత్తి
పోటుగా శ్రీ. శ్రీ. !

మత్తువదల్చే మాటల్తో
నెత్తురు పొంగించే
కొత్త కవిత్వం లో
సత్తువతో, జీవంతో, భావంతో
ఎత్తుకపోతా డెక్కడికో!

అతనికి అతనే సాటి!
కృతిలో ఆకృతిలో
భాషలో, వేషంలో
చూపులో స్ఫురద్రూపి!
శ్రీ. శ్రీనివాసరావ్!

# మహాకవి ప్రశంస

పెనుమర్తి కామేశ్వరరావు.

తెలుగుందేశపు బూర్వపుణ్యకలనఁ దీవ్యత్కళాశోభతో
విలసత్కావ్యపరంపరాళి నొసఁగెఁ విద్వత్కవీశుండు, స
త్యలఘుప్రజ్ఞుఁడు, విశ్వనాథ బుధవంశాంభోధిచంద్రుండు, ని
ర్మల భావామృతవృష్టితో, తెలుఁగు మర్యాదల్ ప్రపంచించుచుఁ.

వెలుఁగురాయఁడ! వెలుగుము విశ్వనాథ
సత్యనారాయణాగ్రణి శాశ్వతముగ!
అల రవి శశియు నాకాశమందు వెలుఁగు
చుండు నంత కాల మనంతచండశోభ!

నీ కవిత్వమధువుఁ గ్రోలి నేను విస్మ
యమున మేనును మరతును అనవరతము!
నీరసస్థితి వాసి శరీరమునకు
నూతనోత్సాహ ముదయించునోయి నాకు!

నీవు పలికిన పలుకెల్ల నిశ్చయముగ
నమృతవాహిని, భావము లతి మనోజ్ఞ
కాంతితో విరాజిల్లు చుక్కలుగదోయి!
నీ రచన లెల్ల మానవ నిధులు గావె!

వ్రాసిన కావ్యమెల్ల ప్రతిభాయుతమై, తెలుఁగమ్మకోసమై
చేసిన క్రొత్తవస్తువను చెల్వున నొప్పుచు నున్నదోయి! నీ
శాసనముల్ మహాప్రథిత శౌనక సంయము లిచ్చినట్టి ధ
ర్మాసన వాక్సుధారసమునందలి సారముగాదె సత్కవీ!

కిన్నెరసాని వాగు నొక కేవల భామినిగా సృజించినా
వెన్నగరాని ప్రేమ పచరించి హృదీశ్వరు విప్రయోగపున్
విన్నదనమ్ము కన్నులకు విందగు నట్లుగఁ జూపినావు, ఆ
వన్నెలు చిన్నెలున్ మరపు వచ్చునె యెవ్వరికైన నెన్నడున్!

శ్లథమై పోయిన యాంధ్రరాజ్యవిభవైశ్వర్యమ్ము నొక్కమ్మడిన్
పృథులస్వాదుమరంద పద్యములలో ప్రీతి న్నివేదించి, యాం
ధ్ర ధరాధీశ్వర కీర్తికాంత కొక స్థానం బిచ్చి యాంధ్రావనిన్
నిదురం బాపితి, మేలుకొల్పితివి సందీప్తోజ్జ్వల త్కావ్యమె !

నీ కావ్యంబులు మధురస
లోకారాధ్యములు ప్రేమలోలుపవృత్తుల్
రాకాశశి గనఁ బొందెడి
మూకానందము నొసంగు ముద్దుల మూటల్ !

(ఇవి శ్రీ సత్యనారాయణగారు తెనాలి కన్యకాపరమేశ్వరీ సత్ర
ములో 'యశము' గూర్చి ఉపన్యసించిన సందర్భమున చదువఁబడినవి.)

# విచికిత్స

బొడ్డు బాపిరాజు

ఓ ప్రభూ! నీవు విచ్చేసి యుంటి వనుచు-
నీ కొరకు వేచి వేచి కన్నీళ్లతోడ
అలసి నిద్రించి గుండె మ్రోతలకు లేచి
నీ పదధ్వనిగా గమనించి చూతు.

నిన్ను దర్శింపలేక విపన్నమతిని
కనులు విచ్చియు కల యని కలవరింతు.
(స్వామి మృదుపాద విన్యాస శబ్ద సరణి
యెరుగనా? నాథు డలిగి క న్మొరగి పోయె.

ఎన్ని దీర్ఘయామినులు వేగించినానొ
పతి యెరుంగడె? నేడు నా వలన దోష
మున్నదే యను, మంతన యుజ్జగింప
పాడియే? ఒక్క పిలుపున పలుక నేమొ?

తనను పిలుచుటలో జీవితమ్ము కొసకు
ప్రాకిపోయిన దాసుని భాగ్య మగుచు
తరలి వచ్చిన నా స్వామి మరలె నంచు
తలచెదను గాక భ్రమయొ, సత్యమ్మొ యింత?)

ఈవు వచ్చుటె నిజము కాదేని స్వామి!
యీ కుటీరాంతరముల వాసించు నెట్లు?
సరస వనమాలికా దివ్య సౌరభమ్ము
లొరసికొని హరిచందన పరిమళములు.

ఇచటి యీ భూరజమ్మున కెంత మహిమ
అబ్బె ప్రభుపాద సంస్పర్శ! అంటినంత
మై పులకరించి, కనులు చెమ్మగిలి, మీదు
చరణముల నొత్తు సుఖములో కరగు మనసు.

జాలి పడనట్టి నీ క్రూర చర్య తలచి
యీ రజశ్శయ్య మేను పొర్లించుకొనుచు
తత్సుఖ చ్ఛాయనే నిరంతర నిరీక్ష
తరతరమ్ములు నీ కృప కొరకు నిలుతు.

(విభుని సెప పెట్టెదను కాని, ప్రేమ లేక
యింత దూరమ్మ, నీ శిలావృత పథమ్ము
గడచి యీ దీన మానవు గడప ముందు
నిలుచునే? నన్ను గని యెట్లు తలచినాడొ!

వ్యర్థుడ! శ్రమించి నా కయి వచ్చిన పతి
పదము లనుతాపమధుర బాష్పముల కడిగి
కన్నులకు నద్దుకొన లేను; కళవళింతు;
ఎంత యపచార? మెట్లు సహించు స్వామి?

ఈ ప్రమత్తు నదృష్టమ్ము నెంచి యధిపు
డెంతసేపు వీక్షించి వీక్షించి విసివి
తరలెనో కాక, నిరత తద్భావనాగ
తాత్మజనిత మోహ విలాస మగునొ యేమొ?)

స్వామి! నీ పదార్పితము జీవనము నెల్ల
గడచి విఫలుండ నను చిరకాలశాంతి,
నిలుచు - నా గాథతోడ నీ నిర్దయత్వ
మీ జగము చెప్పుకొనునులే యింకమీద.

# 'Vibgyor' నుండి

బి. వి. సింగరాచార్య.

౧

మణి ప్రవాళాలు.

—.:.—

ఆంధ్రం, ఆంగ్లం,
हिन्दूस्थानी,
Cup + ఉః, Plate + ఉః,
Spoon + ఉః, ఐతే
అయ్యర్ बनती मेरी कविता
Vibgyor है Cofee Club

*　　*　　*

స్వాతంత్ర్యం కావాలన్నా,
పారతంత్ర్యం పోవాలన్నా,
తోక చుక్క
తోక
—పీకు.

*　　*　　*

అసలు Science develope అయి
mortals immortalise అయితే
నక్షత్ర లోకులేనా అంత
बेवकूफ లు —పాపం ?
Useless Imperialism—
(ఆఁ. కాదులెండి)
Nazism వచ్చి
Universal love హెచ్చి
"అంతా క్షేమం" అని
Other words కి వ్రాస్తే—
Reply యే जवान లో
వస్తుందో....
ఎవరు पढनेवाला + ఓ
ఏమన్నా कुछ सोचते हो ?

*　　*　　*

తెల్లగా మింట నెగిరే
దివిజగంగా....
నల్లగా మంట నిగిరే
భువిజ గంగా....
అపరాహ్ణంలో
అర్ధరాత్రి లా
ఐక్యమైపోయి,
పాతాళానికి
(కాదు; నాగకన్యలుండే లోకానికి)
ప్రయాణం కట్టింది
ప్రస్తుతం—మన Poetry.

—♦—

౨

గులాబీలకూ....
Petals ఉండవే ?
పెటల్సండీ—
దళాలు... దళాలు !!
Dawn's rose color
Silk చీరె కట్టుకున్న
About to be consummated
పెళ్ళికూతురు పమిటెల్లాగ—
వంపుతిరిగి వుంటయ్యే....
అవండీ.... అవీ !
గులాబీ Petals !
గులాబీ దళాలు !!
ఆకులు కావండీ
అయ్యో రామ !
అవీ.... అవేమిటంటే
ఏమంటా రంటే....
ఆఁ... ఆఁ.... ఆగండి
గులాబీ రేకులు !
గులాబీ పూల రేకులు !!
అమ్మయ్యా !
అర్థమయింది గద !
అవీ.... అవీ....
అవి బలే బాగుంటై
....కాదండీ ?
ఎంత అందమండీ....
నిజంగా !
అందులోనూ అసలు
అల్లాపచ్చని ఆకులసందున
పసందుగా, వయ్యారంగా షే
కవుతూ వుంటే—
మాంచి తమాషా
గా వుండదుట
య్యా ఏ మంటావ్ ?
దాని సువాసన....?
దాం తస్సర్ మం
దూ రాణే అది
పూ లన్నిటికీ
నిజానికి !
ఈ పూల్లోంచీ....
మాంఛి అత్తరువు
తీస్తారుటగా !
తెలుసా మీకు ?
మాంచి దిల్ ఖుషీ
చేస్తుందిటగా !
'య్యి'ంత కవిత్వం
వ్రాసే వాడికి
ఎవడూ, ఎపుడూ
Present చెయ్యడేం ?

—♦—

# భవభూతి

వట్టికొండ రంగయ్య

తావక పూతరామచరితమ్ము పఠించి పఠించి, తన్మిళ
ద్ధ్యానము మెచ్చిమెచ్చి, తదపార గళన్మధువాని ఆని, మో
దావహ శేముషీపటిమ నల్లిన పద్య సుమస్రజమ్ము నీ
పావన కంఠదేశమున భక్తి సమర్పణసేసి మ్రొక్కెదన్.

మధుమధుర ప్రసిద్ధ పదమండలమండిత, భావనైపుణీ
ప్రథిత, రసానువిద్ధ, మృదుపాకసమన్విత, ఔచితీ గుణా
త్యధిక, ధ్వనిప్రభూత యగు త్వత్కవితావనితా సుధావచో
భ్యుదయ రసాభిషేకమున మ్రోడులుగూడ చిగిర్చి పూచెదున్.

ఎందరు సంస్కృతాంధ్రముల నింపగు కైత రచింప లేదు? నీ
చందమునన్ హృదంతర విసర్పివివర్త పరిభ్రమత్సుధా
స్యంది పదప్రయోగ మృదుసౌరభ వృష్టి గిరాంసతీ మనో
నందన మంజువాటి కతి నవ్యవికాస మొసంగిరే యొరుల్?

నీ మృదునాటకత్రయము నే నెపుడైన పఠింతునేని ఏ
దో మదమో, సుఖమ్మొ, పరితోషమొ, దుఃఖమొ, లేక మోహమో,
ఏమొ ఎరుంగరాని గుణమేదియొ ముగ్ధునిజేసి నన్ రహ
స్సీమల తన్మయత్వమున చిత్తము చిందులు ద్రొక్క జేసెదున్.

తొలి నునుసంజచాయలకు తొంగలిరేకుల విప్పికొంచు చూ
పుల కులుకుందనమ్ము పసపుల్ సవరింప, పసిండి మంచుముం
పుల జలకమ్ము లాడి, వలపుల్ కురిపించు ప్రసూన కుట్మల
మ్ముల కవిసార్వభౌము భవభూతి పదాంబుజ పూజ సేసెదన్.

## ప్ర వా సి

నీ కొరకేను నా కొరకు నీవు వియోగ విషాదభూత బా
ధాకులితాస్మదీయ హృదయాంబురుహద్వయ మిట్లు వాడి పో
నీక సరోరుహాక్షి, ప్రణయైక రసార్ద్రవిభాత బాలవై
భాకరరక్తభానువుల స్పర్శముచే వికసింపజేతమే!

ఎన్ని దినమ్ము లిట్లు రమణీ, అనురాగనిమగ్నవృత్తిమై
కన్నులు ముక్కుమూసికొని గంటలు దీర్ఘయుగమ్ము లట్లు లా
పన్నులమై తపించుచు ప్రవాసము చేయుదు మింక; సర్వసం
పన్నము యౌవనమ్ము వసివాడిన పిమ్మట లాభముండునే?

నేను మహాపరాధి నని నీవు మనమ్మున కిన్కబూన నే
లా నవనీతముగ్ధము మదార్ద్రహృదంబుజ మంచు నెన్నడో
మానిని, పల్కకూడ; అనుమానపిశాచి మహోగ్రదుఃఖసం
తాననిధాన మాను; పరితాప మదేల గతప్రవృత్తికై?

తావక మోహనాకృతి సదా కనువిప్పిన మూసికొన్న బా
ధావిల మామకీన హృదయాంబురుహాంకిత మాటజేసి నా
నావిధ భూషితాంగియయి నాటికినాటికి గాటమౌచు నా
పావన నేత్రయుగ్మ మెడబాయక గన్పడుచుండు నెచ్చెలీ!

సంతతముఁ భవచ్చరణ సారసనూపుర ఝుంఝుణార్భటుల్
కాంత, త్వదీయ కమ్ర కరకంకణమంజులమందరావ మ
త్యంత మనోజ్ఞమై శ్రవములందు స్వనించెడు వింతవింతగా
అంతయుగూడ కేవల విహాయసహర్మ్యము లట్లు లా నొకో!

చారువసంత శాంత దివసాంతములన్ లతి కాంతకాంత భూ
మీరుహావల్లికాప్రతతి మేదుర కర్బుర క్రమవర్ణ శో
భా రమణీయతల్ కనులపండువులై ప్రమదం బెలర్పగా
స్వైర విహారవృత్తి వనవాటి జరింతము సర్వకాలమున్.

బాలరసాలసాల నవపల్లవముల్ దనివార మెక్కి రా
గాలపనోపలాలిత పికామృత మోహనగానమందు ప్రే
మాలసమైన కంఠమున హాయిగ బాడ శ్రుతిన్ లగించి; త
ల్లోలుపతన్ లయించెద వధూంమణి, త్వన్మృదుగాన మాధురిన్ .

శారదయామినీ మధుర చారుతరామలసాంద్ర చంద్రికా
పూరమునం ప్రపంచము ప్రమోద పయోనిధి మున్కలాడ; శృం
గారవనమ్ములోన నవకంపు పువుం బొదరిండ్ల నీడలన్
జేరి సుఖింప గల్గ రమణీ, మరి స్వర్గము గిర్గ మేటికిన్.

తెల తెలవార, సంజకడ, దివ్య పరీమళసాంద్రమంద శీ
తల పవనోర్మి మాలికల తాకున మేల్కొని, పొన్నునుండి, కో
మలి, నవకంజపుంజమధుమంజుకవిత్వము నేను చెప్ప, కో
మలముగ నీవు వ్రాయు, కనుమా మనవైభవ మెట్టులుండునో !

# "చాలనీ"

(పుస్తక సమీక్ష)

## ముసలమ్మ మరణము

డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి,

ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు.

ప్రచురణ కర్తలు: ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము, పటమటలంక (వయా) బెజవాడ.

షష్టిపూర్తి ముద్రణము, ౧౯౪౦.

ఈ గ్రంథము శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు వ్రాసిన పద్య కావ్యము. శ్రీ రెడ్డిగారు రాజకీయములలోను, విద్యాశాఖలోను మాత్రమే కాక తెలుగు వాఙ్మయ రంగములో బహుకాలమునుండి సుప్రసిద్ధులు. వారికీ మధ్య జరపిన షష్టిపూర్తి ఉత్సవ సందర్భములో వారి మిత్రులు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షుడు ఐన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు ఆ సంఘము తరఫున ఈ కావ్యమును పునర్ముద్రణము చేసి ప్రచురించినారు.

'బుక్క-రాయ సముద్రము' అనే ఊరి చెరువుకట్ట అపరిమిత వృష్టివల్ల తెగబడి ఊరిమీద పడుతుందని భయము కలిగి ఊరివారు పోలేరమ్మ జాతర చేసినారు. అప్పుడు వినబడ్డ ఆకాశవాణి నిర్దేశము ప్రకారము 'ముసలమ్మ' అనే పేరు గల బసిరెడ్డి కడగంటి కోడలు బలిగా పోయి ఆ చెరువులో పడుతుంది. ఇది కావ్యవస్తువు!

ఈ కథ రసవద్రచనగా చేయడానికి ఎన్నో అవకాశము లున్నవి. ఐనప్పటికీ ఈ కావ్యములో కథనములో చమత్కృతి కాని, భావములో ఉన్నతి గాని, పాత్రనిర్మాణములో ఉదాత్తతగాని అంతగా కనబడవు. ఇంత దుఃఖము కలిగించవలసిన కథ ఐనా చదివి నప్పుడు కంటతడి వచ్చిన తావులు అరుదు.

కథానాయిక పేరు 'ముసలమ్మ' కాబట్టి ఆ పేరు మార్చలే దేమని కవిని ప్రశ్నించ కూడదు. కాని కథలో 'ముసలమ్మ'ది సామాన్య మరణమా? కాదు! అది బలి, ఆహుతి, ఆత్మార్పణము. ముసలమ్మ 'మరణము' అని మాత్రమే కావ్యనామ ముంచిన గ్రంథకర్తకు కథలో స్వతస్సిద్ధముగా ఉన్న రసవత్త్వము గోచరించ లేదని తోస్తుంది.

శ్రీ రెడ్డిగారు విద్యార్థిగా ఉండగా మద్రాసు క్రైస్తవ కళాశాల ఆంధ్ర భాషాభిరంజన సమాజములో శ్రీ సమర్థి రంగయ్యసెట్టిగారు పెట్టిన పోటీలో బహుమానము పొందిన కావ్య మిది. అటువంటి బహుమానమున కిది తగినదే ఐ ఉన్నది. అదిగాక ఇది ౧౯౦౦ సంవత్సరములో వ్రాసిన గ్రంథమని మనము జ్ఞాపక ముంచుకోనవలెను. అది ఒక సంధి సమయము. అటు పూర్వ కావ్యముల కున్న ఉదాత్తత కాని, నవీన కావ్యములకున్న మాధుర్యము కాని అప్పటి రచనలలో లేవు.

పూర్వకవులు పురవర్ణన చేసినట్లే ఈ కవికూడా ప్రథమములో పల్లియ వర్ణన చేసినారు. రెండవ పద్యము ఎత్తుగడ చూడండి!

"చెఱకుఁదోటలఁ జొచ్చి కోడెకి పాడొనరించి
దొరలట్టుబోవు పందుల గణంబు
నెండ్రకాయల కోఱ కేతెంచి గుంటపై
మెక్క-కూసెడు గుంటనక్క-గములు"

పూర్వకవుల ఉత్ప్రేక్షలకు విసిగి స్వభావోక్తికి పై విధముగా ప్రయత్నించి ఉండవలె!

'ముసలమ్మ' పెనిమిటివద్దనూ, అత్తమామలవద్దనూ, పసిపాపవద్దనూ, చివరకు జనసంఘమువద్దనూ సెలవు తీసుకుంటుంది. దైవభక్తివల్ల తన జీవ మర్పించుకొన్నదో, పెద్దల ఆజ్ఞవల్ల ఆ పని చేసినదో, పరోపకార బుద్ధితో చేసినదో, కాక ఇతరుల బలవంతము

వల్ల అందుకు నిశ్చయించినదో, ఇన్ని సంభాషణ లలో కూడా కవి స్పష్టపరచ లేదు. అన్నీ ఆమె మనస్సులో పెనగులాడిన వంటే ఆ ఆందోళనము కూడా కవి చూప లేదు. కావ్యవస్తువు కవి భావనా వీథిలో ఆలోడితమై పునస్సృష్టి అయినదా?

బహుకాలము క్రిందట ఈ కావ్యము రచించిన శ్రీ రెడ్డిగారు మళ్లీ కావ్యములు ప్రచురించలేదు. వారు విద్వాంసులూ, రసజ్ఞులూ అయినందువల్ల కావ్యసృష్టి తాము చేయవలసిన పని కాదని విర మించి ఉంటా రని మా విశ్వాసము.

పద్యములు చేసినామనీ, కట్టినా మన్న ఈ కాలపు వారు అనడంలేదు. ఈ గ్రంథము నాల్గవ పేజీలో "స్తుతిప్రకరణమునందలి పద్యములు పెక్కులు 1897 వ సం॥ చేయబడినవి"......

"...అను పద్యమును జూచి ౧౩ వ పద్యమును గట్టితిని." అని వ్రాసినారు.

ఈ గ్రంథములో మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు కొన్ని తప్పులు సవరించినట్లు ముఖపత్రములో చెప్పినారు. ఐనప్పటికీ ఇంకా కొన్ని తప్పులు కనపడవచ్చును. భర్తతో 'ముసలమ్మ' మాటలలో.

........"మీ

రేయిట్లాడిన నేమి చెప్పనగు? నన్నీసారికిం బోయిరా నే యంచుం దయఁబంపవే గుణనిధీ! యే నిన్ను బ్రార్థించెదన్."

ఇందులో భర్తను, కొంత బహువచనములోను, కొంత ఏకవచనములోనూ సంబోధించడము ఉచితము కాదు. మళ్లీ భర్త ప్రత్యుత్తరములో.

పల్లం తైనను నిను

వనజానన! యెన్నడైన వారించితినే?"

అని ఉన్నది. "పల్లెత్తి ఎన్నడైనా అన్నానా?" ఇత్యాదిగా నోరెత్తి అనే అర్థములో 'పల్లెత్తి' అని వ్యవహార మున్నది.

'పల్లు' అనే శబ్దానికి 'కొంచెము' అనే అర్థము లేదు. ఇక్కడ 'పల్లంతైనను' అనేది కృతక భాషా రూపము!

"ఇచట నస్తమించి యినుడు పశ్చిమ గోళ మందు వెలుఁగుగాదె ?"

అన్నారు ఒకచోట. భూగోళమొక్కటే. పశ్చిమ గోళమూ, ప్రాగ్గోళమూ అని రెండు లేవు. పశ్చి మార్థగోళము 'అనవచ్చును.'

పాఠాంతరము అని కొన్ని పాఠాలు ఎందుకో ఇచ్చి నారు. అందులో ౧౮ వ పేజీలో ఇచ్చిన దానిలో ఛందోభంగము ఉన్నది. ఆటవెలది రెండవపాదము!
"తెలుఁగటంచుఁ దలఁచితిరి సుమ్మ."

ఇది అచ్చుతప్పుగా తోచదు.

ఆటవెలదుల నన్నిటిని 'గీ' అను గుర్తుతో వ్యవహ రించడము ఈ గ్రంథములో నూతనముగా కనిపి స్తున్నది.

ఈగ్రంథానికతొలిపలుకు శ్రీగాడిచర్లహరిసర్వోత్తమ రావుగారు వ్రాసినారు. షష్ఠిపూర్తి ముద్రణము అని మొదటనే గాక వారి 'తొలిపలుకు'లో కూడా ఎక్కడ చూచినా 'షష్ఠిపూర్తి' అనే ఉండడము మాకు పరితాపము కలిగించినది. షష్ఠికీ షష్టికీ ఎంత వార ఉన్నదని వారికి తెలియ దని తలంచను. అశ్రద్ధా, అజాగ్రత్తా కారణా అనుకుంటాను.

ఎవరో చివర లఘుటీక వ్రాసినారు. అందులో పొంగలి = పులగము, అని అర్థమిచ్చినారు. పెసర పప్పుతో కలిపివండిన అన్నమును పులగమంటారు. పాలతో పొంగించి చక్కెరగాని, బెల్లముగాని కలి పిన అన్నమును పొంగలి అంటారు. తమిళములోను, కన్నడములోనూ కూడా పొంగలి అంటే పాలతో వండిన అన్నమే. పొంగలి అందరికీ తెలిసిన మాట. ఆ మాటకు లేని అర్థము లఘుటీకలో ఎందుకు ఇచ్చినారో మాకు అవగతము కాలేదు.

డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు విద్వాం సులు. పెద్దలు. ఈ కావ్యము వారు చిన్న తనములో

వ్రాసినప్పటికీ ఇప్పుడు పునః ప్రచురించి సందున విమర్శించవలెనని వచ్చినది. ఈ కాలములో యువకుల రచనల ప్రోత్సహించేవారు అరుదు. మహా మహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వెంకటరత్నము పంతులు, శ్రీ దుర్భా సుబ్రహ్మణ్య శర్మ గార్ల వంటి మహా పండితులు యువకుని రచన అనే ఉద్దేశముతో ౧౯౦౦ సం. లో ఈ గ్రంథము ప్రోత్సహించినట్లు ముఖపత్రమువల్ల మనకు తెలుస్తుంది. ఈ గ్రంథములో

"అరుణోదయచ్ఛాయ లాకాశ పథమున
 నంభోధరముల వేటాడు వేళ
మార్తాండ చండా తపార్తికి ననిలముల్
 పొదరిండ్ల గుసగుసల్ పోవు వేళ
సాయాహ్న లక్ష్మి కనూయ కలుగు భూమి
 తళుకు విఖలు చీరఁ దాల్చు వేళఁ
బండువెన్నెల లేఁడు కొండపై జల జల
 మని పాలునది తాన మాడు వేళఁ
గల మనోహరాకృతు లెల్లఁ గాంచి నీవు
చొక్కి మొక్కనిక్కముగాంచి "యొక్కనాఁడు
మమ్ము మోసపుత్తు" వటంచు మదికి నప్పు
డపుడు దోఁచు; నయ్యది నిజమయ్యె నేఁడు."

అనే పద్యము చదవగానే ఈ కావ్యకర్త కవితాత్మ కలవాడని స్పష్ట పడగలదు.

సో. స. శా.

## శ్రీకృష్ణరాయాభ్యుదయ సంచిక

[ప్రకాశకులు: షష్టిపూర్తి మహోత్సవ సంఘము
వెల రు ౧-౦-౦.
ప్రతిభా ఎలెక్ట్రిక్ ఇండస్ట్రీస్ వారు
మెయినువీథి : రాజమహేంద్రవరము.]

శ్రీ నాళము కృష్ణారావుగారి షష్టిపూర్తి మహోత్సవ సందర్భములో వారి మిత్రులూ, కవులూ పంపిన కావ్యములు, వ్యాసములు, అభినందనాదులు కలిపి ప్రచురించిన సంపుటి ఇది. సంపాదకులు సహదేవ సూర్యప్రకాశరావు, భావరాజు [?] వెంకట కృష్ణారావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, బాల దారి [?] వీరనారాయణదేవుగార్లు. మొత్తము ౫౧ రచనలు, కొన్ని ఛాయాపటములూ ఉన్నవి.

శ్రీ నాళము కృష్ణారావుగారికి 'మధురకవి' అనే బిరుద మున్నది. వారు సరసులు, కవులు, విద్వాంసులు అనటకు ఈ సంచికకు కవి పండితు లనేకులు పంపిన రచనలే సాక్షి. శ్రీ చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రిగారి "ఆశీర్వచనములతో" సంచిక ప్రారంభించినది. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు "మంగళాశాసనము" చేసినారు. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు ఆశీర్వచనప్రశంసలు చేసినారు. శ్రీ బొడ్డు బాపిరాజుగారు "మధురయాత్ర" సాగించి "మధురకవి" ని ప్రశంసించినారు. శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి సోదరులు "కృష్ణ మహస్సును" వర్ణించినారు. శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి "ప్రశంస" చేసినారు. శ్రీ శివశంకర శాస్త్రిగారి "అదృష్టదేవత" అనే వాకోవాక్యము శ్రీ వావిలాల సోమయాజులు "తల్లి" శ్రీ అడ్డేపల్లి నాగగోపాలరావు "వలపుపిలుపు", "వసంతము" అనేవి—ఇవి అన్నీ ప్రత్యేకముగా ప్రశంసింపదగిన ఖండకావ్యములు. ఈ కావ్యాలతో పాటు "దొడ్డమ్మ" అనే కావ్యము ఎందు కిందులోకి ఎక్కిందో ఊహించలేము.

శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు "త్రియంబకః" శబ్దవిచారముచేస్తూ వైయాకరణుల శాసనముల పరిమితి సూచించినారు. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు "కాలీన" శబ్దవిచారములో వైయాకరణశాసనము అనుల్లంఘనీయ మని శాసించినారు. ఉభయులూ కవులూ, పండితులూ అయినా ఒకరిది కేవల కవిపక్షము; రెండవవారిది కేవల పండిత పక్షమూ. శ్రీ కృష్ణరాయకుమార్తె శ్రీమతి కృష్ణ కుమారి "పితృపూజ"తో పాటు "నాచన సోమనాథుడు - నవీన గుణసనాథుడు" అను వ్యాసములో సోమనాథుడు తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొన్నట్లు నిరూపించినది.

"రీతి రాత్మా కావ్యస్య" అనే శీర్షికతో శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు వ్రాసిన వ్యాసము వివాదగ్రస్తము. వారు వామనుని "రీతి రాత్మా కావ్యస్య"తో ప్రారంభించి రీతినే ఇప్పటివారు ఇతర పేర్లతో పాటు "ధారాశుద్ధి" అని వ్యవహరిస్తున్నట్లు తెలిపినారు. కొంతదూరము పోయినతరువాత తిరుపతి వెంకటేశ్వరుల పిమ్మట ఆధునికులలో చక్కని ధారాశుద్ధి కలవారు కొలదిమందియే కలరని ౧౫ మంది ఉన్న జాబితా ఒకటి ఇచ్చి చాలామట్టుకు అది సంపూర్ణమైనదని సూచించినారు. అయితే శ్రీ "రాయప్రోలు సుబ్బారావు"గారు కూడా ఆ జాబితాలో లేక పోవడము ఆశ్చర్యముగా ఉన్నది. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి రచనలలో ధారాశుద్ధి లేకపోతే ఆ జాబితాలో ఉన్న ౧౫ మందిలో ఎవరికీ లేదన వలసివస్తుంది. "రీతి రాత్మా కావ్యస్య" అనే మతమే సర్వపండిత సమ్మతముకాదు. "ధారాశుద్ధి" రీతికి పర్యాయపదముగా వాడటము అసలే న్యాయము కాదు. వ్యక్తిగతమైన ఇష్టానిష్టములు కావ్య విమర్శనలలోనికి చొప్పించడము విద్వాంసుల కు భావ్యమా!

"కృష్ణరాయుని కృతులు" అని శ్రీ పిల్లలమఱ్ఱి వెంకట హనుమంతరావు గారూ "బాలురకవి" అని శ్రీ కొమరవోలు వెంకట సుబ్బారావుగారూ శ్రీ కృష్ణరావుగారి కావ్యములను, కవిత్వమును విమర్శచేసినారు.

"కుర్చీలో సంపాదకుడు" అనే శ్రీ విశ్వనాథ కవి రాజుగారి నాటికలో వారు తమ సాధారణ ధోరణిలో అసభ్య రచనలవల్ల ప్రసిద్ధికి రాదలచిన పత్రికాధిపతిని నాయకునిగా చేసి అట్టివారిని తీవ్రముగా పరిహాసపాత్రులనుగా చేసినారు.

ఈ సంచికకు ఎందరో విద్వాంసులు, కవులు, మిత్రులు తమ రచనలను పంపినారు రచనలన్నీ ముద్రణ ప్రారంభించకపూర్వము సంపాదకులకు చేరనందున కాబోలు ఎటువంటి క్రమమున్నూ ఇందులో లేదు. సంపాదకులు తమ ప్రస్తావనలో "ఇట్టి ప్రచురణములలో క్రమత పాటించుట దుష్కరమని తమవిశ్వాస"మైనట్లు చెప్పిన దానితో మనము ఏకీవించేయెడల ఇటువంటి సంచికలకు సంపాదకత్వమే అనవసర మనవలసివస్తుంది. అది ఎవరికీ సమ్మతము కాదు. అయితే మనదేశములో సకాలములో రచనలు పంపకపొయ్యే దురభ్యాసము రచయితలు తగ్గించుకోవలెనని ఇటువంటి సంచికలు చూచినప్పుడైనా తెలుసుకుంటే బాగుంటుంది.

శ్రీ నాళము కృష్ణరావుగారి అభ్యుదయానికి ప్రచురించిన ఈ సంచికకు మా స్వాగతము.

సో. న. శా.

## రెండో ప్రపంచ యుద్ధమా?

(ఆంధ్రకేసరి గ్రంథమాల మొదటిభాగం వెల.అ. 4)
ఇప్పుడు మిక్కిలి ఘోరముగాను, తీవ్రముగాను ముఖ్యముగా యూరోపులో జరుగుతూ ఉన్న యుద్ధముగురించి వ్రాసిన గ్రంథము ఇది. దీనిలో వెర్సాసంధి నాటినుండి (అనగా 1914 నుండి 1918 వరకు జరిగిన యుద్ధానంతరము జరిగిన వెర్సా సంధి నుండి) మ్యూనికు సమావేశమువరకు (1938-39) యూరోపులో నడచిన శాంతి ప్రయత్నముల చరిత్ర వర్ణింపబడినది. 1914-18 యుద్ధములో వీగి పోయిన జర్మనీని నిర్బంధించి చేసిన వెర్సాసంధి ఎట్లు ప్రస్తుతయుద్ధమునకు బీజమైనదో చూపింప బడినది. అప్పుడు అవమానింపబడిన జర్మనీ ప్రజలు తిరిగీ గౌరవమును (వారు అనుకొన్న గౌరవమును) సంపాదించవలెనని చేసిన మహాప్రయత్నములు నిరూపింపబడినవి. ఈ మహాప్రయత్నముల ఫలమే ఈ ఘోరసంగ్రామము.

ఈ చరిత్ర చక్కగా వివరింపబడినది. జర్మనీకి జరిగిన పరాభవము. వెర్సా సంధి విఘ్నము; జర్మనీ తలయెత్తడము వరకు చరిత్ర కొంత భిన్నగా నడిచి పోయింది. దానిని వర్ణించడము అంత క్లిష్టముగా

ఉండదు. ఈ కథలో రెండో సోపానము సమష్టి క్షేమ విధానము అయిన "లీగు" భంగము "లీగు" జాతుల సమష్టి. దీనిలో చేర నిరాకరించిన వారు కొందరు, చేరి విడిపోయినవారు కొందరు. మొదట నుండీ ఉపేక్షాభావముతో దూరముగా ఉండిన వారు కొందరు; ఇట్లు అనేక రీతుల ఈ విధానము నిష్ఫలమైనది. ఈ లీగు వారు చేసిన తీర్మానములు బలహీనములై తీర్మానించిన వారుకూడా అవలంబించని దౌర్భాగ్యపు స్థితికి వచ్చి ఈ విధానము చెడిపోయినది. దీని అపేక్ష లేకుండా దేశ ప్రభుత్వములు తమకు అనుగుణములైనట్లు భిన్న భిన్నములుగాను, ఒకప్పుడు స్వవిరోధములుగాను ఉండే సమాఖ్యలు చేసుకొంటూ వచ్చినవి. ఈ రోజులలో జర్మనీ ఎట్లు చాణక్యనీతిని, సామదాన భేదోపాయములను నిర్వహించి తన స్థితిని బలపరచుకొనుచుండెనో ఈ చిన్న గ్రంథములో వర్ణింపబడినది. మూడో సోపానము యుద్ధభీతిన్నీ యుద్ధ నివారణ ప్రయత్నములున్నూ, జర్మనీ మాటి మాటికి యుద్ధమునకు సిద్ధమని భయపెట్టి అన్ని దేశములను తన అధికారమునకు లోబడేటట్లు చేయుచుండుట. హిట్లరు విజృంభణము; రషియా, ఇటలీ, ఇంగ్లండు, ఫ్రాంసు ప్రభుత్వముల చిత్ర విచిత్ర లంఘనములు; ఛేంబర్ లీను (ఇంగ్లండు ప్రధాని) గారి శాంతి ప్రయత్నములు; సాంత్వనము చేసిన కొలదీ హిట్లరు పెచ్చు పెరగడము; తుదకు ఛెకోస్లవోకియా ఆక్రమణము - ఈ కథ అంతా వర్ణింపబడినది.

గ్రంథకర్తగారు ఉపయోగించిన శైలి మెచ్చుకో తగినది. చదవడానికి ఇంపుగా ఒకకథ చెప్పుతూ ఉన్నట్లు చాలా సులువుగా నడుస్తూ ఉంటుంది కథనము. కొంచెము హాస్య మాడుతూ, నవ్విస్తూ కథనము నడుస్తుంది. ఈ సుగుణములు మొదటి అధ్యాయములో ఉన్నట్లు ఆఖరి అధ్యాయములలో లేవు. మొదటి అధ్యాయములు వ్రాసేటప్పుడు ఉన్న స్వతంత్ర కల్పన రానురాను తగ్గిపోయి, భాషాంతరీకరణము ప్రారంభమైనది. విషయమును స్వాధీనపరచుకొని బుద్ధియొదుట ఉంచుకొని వ్రాసినప్పుడు ఉండే స్వతంత్రత భాషాంతరీకరణమప్పుడు ఉండదు కదా. అంతేకాకుండా మొదటి అధ్యాయముల లోనిది మొదటి సోపానమునకు సంబంధించిన కథ. అది అంత క్లిష్టముగా ఉండదు. రెండో దానిలో చాణక్యము అన్ని ప్రభుత్వాలలోను విజృంభించిన కథ చెప్పవలసి వచ్చింది. విషయ సంకీర్ణము ఎక్కువై కథనము సరిగ్గా నడవలేక పోయింది. అందులో ముఖ్యముగా సమష్టివిధానము, అది భంగమొందడము - ఈకథ విశదముగా లేదు. ఆఖరి అధ్యాయములు వ్రాసే సరికి రచనలో కొంత తొందరకూడా కలిగింది అని నా అభిప్రాయము. అందుచేతనే పునరుక్తి కూడా కొన్నిచోట్ల కలదు. విషయమంతా చక్కగా బుద్ధిలో సంకలనము చేసికొని క్రింద మీద తిరగవేయడానికి వ్యవధి లేక పోయిందేమో అని నా ఊహ. ఈ తొందర నాల్గో అధ్యాయము నుండీ కనబడుతుంది. అధ్యాయము ముగింపులో కూడా ఆ తొందర వ్యక్తమవుతుంది.

ఉపయోగించిన తెలుగుభాష సజీవమైన వ్యావహారిక భాష. చాలా సంతోషము. గ్రంథకర్తగారి ప్రాంతీయ పదములు, ప్రయోగములు చేరినవి. తప్పని కాదు; కాని అన్ని ప్రాంతములవారికి ఉపయోగించవలసిన ఇట్టి శాస్త్రగుల్య గ్రంథములలో అవి లేకుండా ఉండవలెనని నా అభిప్రాయం. కాని సంస్కృతపదములను, తత్సమములను మాత్రము తప్పులులేకుండా వాడవలెను; వాటి విషయమై వ్యావహారికభ్రంశములు ఉపయుక్తములు కావుగదా. ప్రపంచకము — "క" ఎందుకు? సంస్కృత సమాసముల కల్పనలో ఆ వ్యాకరణ మర్యాదలు పాటించవలెనని నా అభిప్రాయము. సంజ్ఞాపదములగురించి కొంత వివాదఉంది నిజమే. ఆంగ్లేయపదముల నేవాడవలెననికొందరు, ఉచితమైన సంస్కృత పదములను సృజించవలెనని కొందరు అభిప్రాయ పడుతున్నారు. ఎప్పటికైనా ఆ పదములు తెగులుపదములు అనవలెను. సంస్కృతపదములను కల్పించేటప్పుడు అవి ఆ అర్థమును స్ఫురింప చేయగలిగి ఉండవలెను, సమాసములను, తద్ధితలను,

కృత్తులను చేసేటప్పుడు మాత్రము సంస్కృత వ్యాకరణ నియమములను అనుసరించవలెను గదా. ఇట్టి పదములను కల్పించేటప్పుడు "సప్లయి" అనే ఆంగ్లపదములను అలాగే ఎందుకు వాడవలెనో తెలియలేదు.

ఇతర భాషా పదములను నామధేయ పదములను ముఖ్యముగా, ఉపయోగించేటప్పుడు, వాటి ఉచ్చారణ ఆ భాషలలో ఎట్లుఉండునో అలాగే తెలుగులో కూడా ఉంచవలెను. ఈ విషయమై తప్పులు ఉన్నవని చెప్పక తప్పిందికాదు. కొన్నిటి ఉచ్చారణ ఆపదముల అక్షర సంపుటినుండి ఊహించ వలసి పడదు. తెలిసిన వారినుండి కనుక్కోవలసినదే. అట్టి నామధేయవాచకములలో నేకాక సామాన్య పదముల ఉచ్చారణలో కూడా కొన్ని తప్పులు ఉండిపోయినవి. గ్రంథకర్తగారి ఇంగ్లీషు జ్ఞానము గురించి నాకు ఏమీ తెలియనందున ఆ తప్పులు ఎట్లు వచ్చినవో నేను చెప్పజాలను.

క్రియా వాచకముల వర్తమాన భూతకాలములు కలిసిపోయినవి: ఒకవేళ ఇది ఆ ప్రాంతమందున్న వ్యావహారిక మేమో నాకు తెలియదు. పదముల వ్యవధానము, కలపడము అచ్చులో కొన్నిచోట్ల సరిగ్గా లేనందున చదివే వారికి ఇబ్బంది కలుగుతుంది అని అనుకొంటాను. విషయము క్రొత్తది: పదములు క్రొత్తవి; ఆంగ్ల - ఆంధ్ర పదములను కలిపి వాడక తీరదు; అందుచేత అచ్చులో కొంత ఎక్కువ సదుపాయము ఉండవలెనని నా కోరిక. వీటి కన్నిటికీ ఉదాహరణములు చూపిస్తూ వ్రాయడము అవసరము లేదని మాని వేస్తున్నాను.

ఇట్లు కొన్నిలోపములు ఉన్నా, ఆ లోపములగురించి ఈ విమర్శనలో కొంచెము ఎక్కువగా వ్రాసినా, గ్రంథముయొక్క ముఖ్యప్రయోజనమును నిరసించే ఉద్దేశ మేమీ లేదు. ఇది గ్రంథములో మొదటి భాగము. ఉన్న భాగాలలో ఈ లోపములు తగ్గిపోవచ్చును అని ఆశఉన్నది.

కాని ఒక్క ప్రశ్న ఉంది. కేవలము ఆంగ్లభాష రాని వారికి ఈ గ్రంథము ఎంతవరకు ఉపయోగకరము? ఎట్లు ఉపయోగించుకొనగలరు. అనే సంశయము నాకు తీరలేదు. ఆంగ్లభాష వచ్చిన వారికి కూడా దీనిని చదివే అభిలాష ఉండకూడదని అభిప్రాయము కాదు.

"స్వామి"

## యవ్వనం

మల్లాది అవధాని

[ప్రకాశకులు: స్వర్ణలతా గ్రంథమాల కాకినాడ క్రౌను 1/8 90 పుటలు—వెల నాలుగణాలు]

"జనబాహుళ్యంలో చైతన్యం కలిగించడం మా పని. హాస్యం సంస్కరణ కుపకరించే వజ్రాయుధమని మేము నమ్ముతున్నాము. మేము ప్రకటించే వినోద రచనలలో ప్రబోధం అంతర్లీనమై ఉంటుంది. మా గ్రంథాలు సమాజానికీ, దేశానికి, జాతికీ ఉపకరించేవిగా ఉంటవి. ఇది మా ఆశయం." ఇవి 'నివేదన'లో ప్రకాశకు లన్నమాటలు.

'యవ్వనం' స్వర్ణలతా గ్రంథమాలవారి ప్రథమ కుసుమము. ఇది శ్రీమల్లాది అవధానిగారి హిందూస్థానీకాఫీ, చల్ మోహనరంగా, రంభ, బుల్ బుల్, జయవిజయులు అనే అయిదు నాటికల సంపుటి. ప్రతినాటికా వస్తువు యవ్వనమనే ద్వితీయజీవితావస్థకు సంబంధించింది కాబట్టి 'యవ్వన'మని నామకరణము చేయటం ఎంతో సమంజసమైన పని.

అవధానిగారిని క్రొత్తగా పాఠకలోకానికి పరిచయం చేయటము అనవసరము. వారు జగమెరిగిన బ్రాహ్మణులు. వారి రచనా పద్ధతి తెలిసినదే.

సక్రమమైన కారణం లేకుండా పదేపదే విడాకులిచ్చి మళ్ళీ పునస్సమాగము పొందటము, ఎన్ని పెండ్లిండ్లు చేసుకున్నా తృప్తి లేకపోవటమూ, నేటి వైద్యులు, సాముద్రిక శాస్త్రవేత్తల శక్తి సామ

ర్థ్యాలూ, గుగుత్వానికీ వయస్సుకూ ఉన్న సన్నిహిత సంబంధమూ, స్వయంవర రీతులూ ఈ నాటికలకు వస్తువులు. వీటిలో రచయిత ప్రబోధంకన్నా వెక్కిరింపు, కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వించడమూ ప్రధాన గుణాలుగా పెట్టుకున్నట్లు కనబడతాడు. ఎవరైనా ఈ ప్రహసనములో చెప్పినట్లుగా జరగటాని వీలుందా అంటే,

“ప్రహసనం ఎక్కడో ప్రారంభమై ఎల్లాగనో నడిచి ఎక్కడో అంతమయి పోతుంది. దాని కర్థమేమిటి, బద్ధమేమిటి! వినోదం! వినోదం! వినోదం! ఇటువంటి ప్రహసనాలు జరుగవని ఎవరైనా అంటాడా? అంటే వాడు చేతగాని బడ్డాను అని మనం తెలిసికోవాలిసి ఉంటుంది” అని సమాధానం చెప్పటానికి సిద్ధమైనట్లుగా కనబడుతున్నారు. కాబట్టి ప్రహసనమంటే నేలవిడిచి సాము చేయటమా అని ప్రశ్నించి “చేతగాని బడ్డా” నని అనిపించుకో తలచలేదు.

“నవ్వించడమంటే వెక్కిరించడము కాదు. బుద్ధికీ, హృదయానికీ గిలిగింతలు పెట్టేది నిజమైన హాస్యము. దానికి ఉక్తి వైచిత్ర్యము ప్రధానము. నర్మోక్తి, [illegible]లోక్తి, సరసోక్తి కావాలి.”

‘హాస్యోచితములైన సందర్భాలు ప్రతి విషయములోనూ చమత్కారశీలుడికి కనిపిస్తవి. వాటిని వ్యంగ్యమర్యాదతో అందమైన భాషలో అతను వెల్లడిస్తాడు. లోపాలూ, అవకతవకలూ వెల్లడించడమే హాస్యము గాదు. ఆ వెల్లడించే పద్ధతిలో చాతుర్యమూ, పనితనమూ ఉంటే కాని రసజ్ఞులు హర్షించరు. ఛందోబద్ధమైన ప్రతిదీ కవిత్వము కానట్లే ప్రతిదీ హాస్యము కాదు. కానీ ఒక విషయమున్నది “సమానభావ వ్యాప్తి ఉన్న నాగరక సంఘములోనే ఈ హాస్యమునకు సార్థకత ఉన్నది. దానికితోడు సంస్కారమూ అభిరుచీ ఉండాలి. ఇవి లేనివారికి సభ్యమైన హాస్యము లేదు.’

శ్రీ అవధానిగారి నాటికలు జన సామాన్యానికి బాగా అందుబాటులో ఉన్నవి. వారికి నవ్వు పుట్టించటానికి ఇవి సమర్థము లనటములో ఏమీ సంశయము లేదు.

వావిలాల సోమయాజులు.

# నవ్యగ్రంథ విక్రయశాల, నవ్యసాహిత్య పరిషత్, గుంటూరు.

## గిడుగు వెంకట రామమూర్తి

| | |
|---|---|
| వ్యాస సంగ్రహము | ౩-౮-౦ |
| వ్యాసావళి | ౧-౦-౦ |
| బాలకవిశరణ్యము | ౧-౮-౦ |
| భాషాభేషజము | ౧-౦-౦ |
| గద్యచింతామణి | ౧-౮-౦ |

## రాయప్రోలు సుబ్బారావు

| | |
|---|---|
| ఆంధ్రావళి | ౧-౦-౦ |
| జడకుచ్చులు | ౧-౦-౦ |
| మధుకలశము | ౧-౦-౦ |
| తృణకంకణము | ౦-౮-౦ |
| తెనుగుతోట | ౦-౮-౦ |
| కష్టకమల | ౦-౮-౦ |
| స్వప్నకుమారము | ౦-౮-౦ |
| స్నేహలతాదేవి | ౦-౮-౦ |
| రమ్యాలోకము | ౦-౮-౦ |

## చింతా దీక్షితులు

| | |
|---|---|
| ఏకాదశి | ౧-౦-౦ |
| శబరి | ౧-౦-౦ |
| పరిణామవాదము | ౧-౦-౦ |
| లక్క పిడతలు | ౦-౨-౦ |

## శ్రీ పిఠాపురం యువరాజావారు

| | |
|---|---|
| తరంగములు | ౦-౮-౦ |
| స్వార్థత్యాగము | ౧-౦-౦ |
| ఆ లోకము నుండి ఆహ్వానము | ౧-౦-౦ |
| చినుకుల చిందులు | ౧-౦-౦ |
| ‘—’ (నామరహితము) | ౧-౦-౦ |

## దేవులపల్లి కృష్ణశాస్త్రి

| | |
|---|---|
| కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి | ౧-౪-౦ |

## చిలుకూరి నారాయణరావు

| | |
|---|---|
| అంబ, లేక మొండిశిఖండి | ౦-౮-౦ |
| అశ్వత్థామ | ౦-౬-౦ |
| ఆచ్చి, లేక కాపువలపు | ౦-౭-౦ |
| పెండ్లి | ౦-౪-౦ |
| ఉమార్ ఖయాము | ౦-౮-౦ |
| ఉపనిషత్తులు | ౦-౮-౦ |
| కురానుషరీపు | ౪-౦-౦ |
| అశోకుని ధర్మశాసనములు | ౨-౦-౦ |
| సంస్కృత లోకోక్తులు | ౨-౦-౦ |

## విశ్వనాథ సత్యనారాయణ

| | |
|---|---|
| శృంగారవీథి | ౧-౦-౦ |
| వేయి పడగలు | ౨-౮-౦ |
| ఏకవీర | ౧-౦-౦ |
| శశిదూతము | ౦-౬-౦ |
| మాస్వామి | ౦-౭-౦ |
| ఋతుసంహారము | ౦-౬-౦ |

## శ్రీ శివశంకరశాస్త్రి

| | |
|---|---|
| వకుళమాలిక | ౦-౮-౦ |

## నోరి నరసింహశాస్త్రి

| | |
|---|---|
| భాగవతావతరణము | ౦-౪-౦ |
| సోమనాథవిజయము | ౧-౦-౦ |
| నవనీతము | ౦-౧౨-౦ |

## మల్లవరపు విశ్వేశ్వరరావు

| | |
|---|---|
| మధుకీల | ౧-౦-౦ |
| కల్యాణకింకిణి | ౧-౦-౦ |

## రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి

| | |
|---|---|
| హృదయవిహంగము | ౦-౮-౦ |
| ప్రతిభ | ౦-౮-౦ |

| మొక్కపాటి నరసింహశాస్త్రి | |
| --- | --- |
| బారిష్టరు పార్వతీశం | ౧-౦-౦ |

| మొక్కపాటి కృష్ణమూర్తి | |
| --- | --- |
| విరహి | ౦-౮-౦ |

| అత్తిలి సూర్యనారాయణమూర్తి | |
| --- | --- |
| పాలపుంత | ౦-౮-౦ |

| చేకుమళ్ళ కామేశ్వరరావు | |
| --- | --- |
| వాడుకభాష | ౦-౮-౦ |
| పాలపిట్ట | ౦-౨-౦ |
| మిణుగురు పురుగు | ౦-౨-౦ |
| సాంప్రదాయక విజ్ఞానం ౧ | ౦-౮-౦ |

| పురాణం కుమారరాఘవశాస్త్రి | |
| --- | --- |
| గళ్ళచీర | ౦-౮-౦ |

| గిడుగు వెంకట సీతాపతి | |
| --- | --- |
| భారతీశతకము | ౦-౮-౦ |

| నాయని సుబ్బారావు | |
| --- | --- |
| సౌభద్రుని ప్రణయయాత్ర | ౧-౦-౦ |
| మాతృగీతాలు | ౦-౮-౦ |

| అడివి బాపిరాజు | |
| --- | --- |
| గోధూళి | ౦-౮-౦ |

| పెనుమర్తి వెంకటరత్నము | |
| --- | --- |
| రత్నాపణము | ౦-౮-౦ |

| వేదుల సత్యనారాయణశాస్త్రి | |
| --- | --- |
| దీపావళి | ౧-౦-౦ |

| మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి | |
| --- | --- |
| పంచవటి | ౦-౮-౦ |

| రామచంద్ర అప్పారావు | |
| --- | --- |
| అమరకావ్యము | ౦-౪-౦ |
| వసంతగీత | ౦-౮-౦ |

| కవిమిత్రులు | |
| --- | --- |
| కదంబము | ౦-౪-౦ |

| సబ్నవీసు గురునాధరావు | |
| --- | --- |
| గేయగుచ్ఛము | ౦-౮-౦ |

| సబ్నవీసు రామారావు | |
| --- | --- |
| దైతబిడ్డ | ౦-౮-౦ |

| ప్రతిభ సంపుటములు | | |
| --- | --- | --- |
| సంపుటము | ౧ | ౨-౮-౦ |
| ,, | ౨ | ౨-౮-౦ |
| ,, | ౩ | ౨-౮-౦ |
| ,, | ౪ | ౨-౦-౦ |
| ,, | ౫ | ౨-౮-౦ |
| వైతాళికులు సం॥ ముద్దుకృష్ణ | | ౧-౮-౦ |

ప్రాప్తిస్థానము :

నవ్యగ్రంథ విక్రయశాల : నవ్యసాహిత్య పరిషత్, గుంటూరు.

Edited, printed & published by T. Venkataratnam, M. A., L. T., Printed at the Andhra Grandhalaya Press, Bezwada. Published by the Navya Sahitya Parishat, Guntur.